శ్రీరామచంద్ర.

# రాధికా పట్టాభిషేకము.



ఇది

ఏలూరు ఆంధ్రనాటక పరీక్షాసంఘమువారిచే సువర్ణపతకము

బహుమతిః వడసిన సుప్రసిద్ధ నటకులు, "భక్తకబీరు"

మున్నగు బహునాటక గ్రంథకర్తలగు

## కొడాలి సత్యనారాయణరావుగారిచే

రచియింపఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.

పబ్లిషర్సు:-

కే. కే. పట్నాయక్ అండ్ బ్రదర్సు,

బుక్ సెల్లర్సు, ఏలూరు, కృష్ణాజిల్లా.

ఏలూరు.

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాలయందు

యం. రాఘవాచార్యులచే ముద్రింపఁబడియె.

1923.

[వెల రు 1—0—0.]

# ఉపోద్ఘాతము.



పాఠకమహాశయులారా! మదీయప్రచురిత నాటకగ్రంథములలో నియ్యది ద్వితీయము. ఇదియుఁగూడ నస్వతంత్రనాటకంబగుటచే వి లంబగు పీఠిక వ్రాయజాలనైతి. నేను హేలాపురిలో నడుగుఁబెట్టి నది మొదలు నామిత్రులవలనఁ గలుగుచున్న యాదరణీయము, నాటకరచ ప్రోత్సాహము వర్ణనాతీతంబగుట నవ్వారి ఋణంబెట్టులఁ దీర్చుకొ దునా యను భీతి జనించుచున్నయది. రామాయణగాధను వివిధనా కములుగా వ్రాయవలసినదని నాసంపూర్ణ రామాయణపాఠకుల ర్బంధన మెక్కుడగుటచే నందులకియ్యకొని ప్రప్రథమమున దీనినిర యించి శ్రీ కుప్పిలి కృష్ణమూర్తి పట్నాయక్ ప్రదర్శనవారిద్వారా నా ధ్రలోకంబున కంపుకొంటిని. తప్పుల క్షమింపుమని వేడుకొనుట ప పాటియగుటచే నందుల విశేషమేమియు లేనందున నాదోసంబులు వి దోసంబులుగా భావించుకొని యింకను నెక్కుడుగఁ బ్రోత్సా మొసఁగ వేడుకొనుట యుక్తమని యెంచుకొనుచున్నాఁడ. గ్రంథప నాభిలాషులగు మీకు నీనాటకరచనకుఁ గల కారణంబు లరు నున్నారు కాన నేను విస్తరించనక్కఱలేదు. ప్రదర్శకులు మాత్ర నాయనుమతిని బడసియే ప్రదర్శించెదరుగాక యని వేడుకొందు ప్రచురణకర్తలకును, ముద్రాలయాధికారులకును, ప్రోత్సాహక కును సదా కృతజ్ఞుఁడనై వందనశతంబు లర్పించుకొనుచు నింతటితో విరమింతు.

ఇట్లు విధేయుఁడు,

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

## పురుషులు.

1 సూత్రధారుఁడు.
2. దశరథుఁడు.
3. రాముఁడు.
4. లక్ష్మణుఁడు.
5. భరతుఁడు.
6. శత్రుఘ్నుఁడు.
7. వశిష్ఠుఁడు.
8. సుమంత్రుఁడు.
9. సేవకుఁడు.

మఱికొందఱు మునులు.

## స్త్రీలు.

1. కైక.
2. మంథర.
3. కౌసల్య.
4. సుమిత్ర.
5. సీత.



# పాదుకాపట్టాభిషేకము.

[నాంది]

చ. జనకుని శాసనంబు శిర ♦ సావహించి వనాంతరంబులం
దున వసియించెనేనిఁ గృప ♦ తోడఁ ద్రిలోకము లేలుచుండి శాం
తిఁ దన సత్యమార్గమును ♦ చెల్లముగాఁగను జాటినట్టి స
ద్ఘనుఁడగు రామభద్రుఁడు స ♦ దస్యులనేలెడుఁ గాతనిచ్చలున్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేసించి) సదస్యులారా! నేఁటిరాత్రి తమ సమక్షంబునఁ బ్రదర్శించుచున్న యీపాదుకా పట్టాభిషేక నాటకమును,

గీ. గౌతమ సగోత్రజుండు; వేం ♦ కయ్య మంత్రి
సుతుఁడు శివరామకృష్ణుని ♦ సోదరుండు
సత్కవుల దీవెనలఁబొందఁ ♦ జాలువాఁడు
వ్రాసెను గొడాలి సత్యనా ♦ రాయణుండు.

శ్రీ రామాయణాంతర్గత గాథయగుటఁగల దోసంబులక్షమించుమ కేవల రసగ్రహణాభిలాషులరై యానందింప వేఁడుకొనుచు సంగీత పురస్సరంబుగ నాటక ప్రారంభమునకై వలయు పాత్రంబుల నాయత్తపఱుపఁ జనియెద

(నిష్క్రమించును.)



శ్రీరామచంద్ర.

# పాదుకాపట్టాభిషేకము.

## ప్రథమాంకము.

(ప్రవేశము దశరథునియాస్థానము.)

(దశరథుఁడు, మంత్రి, వశిష్ఠుఁడు మఱికొందఱు సభ్యులు ప్రవేశము)

దశ—సభాసదులారా !

గీ. సిరులు వానలుగురియ నా ♦ ర్జించి; తగిన
దానములొసంగి, ధర్మ మా ♦ ర్గానువర్తి
నగుచు రాజ్యంబునేలి వి ♦ ఖ్యాతిఁ జెంది
యనుభవించితి సర్వ సౌ ♦ ఖ్యంబులేను.

మఱియు వేలకొలఁది వత్సరంబు లీపృథ్వీభారంబు వహించుటచేత,

గీ. వార్ధకమువచ్చి ముడుతలు ♦ బడుటనొడలు
దుర్బలత్వంబుఁ జెందె, సం ♦ తోషముగను
రాఘవుని రాజుఁజేసి వి ♦ శ్రాంతిఁ జెందఁ
దలఁచి యున్నాఁడ నాదు స్వాం ♦ తంబునందు.

ఓవశిష్ఠ మహార్షిచంద్రమా !

గీ. సకల విషయంబులను బోధ ♦ సలిపి, ప్రాజ్ఞ
పండితునిజేసి మారాము ♦ వలనఁదగిన

సుతులఁ గైకొన్న మీరలే ♦ యతని మొదలఁ
బ్రేమమునుబూని లగ్నంబుఁ ♦ బెట్టవలయు.

వశి—రాజేంద్రా! సర్వాధికారులగు తాము దలంచుకొనిన విషయంబు సర్వజనాదరణీయమే. కాని శ్రీరామచంద్రుని యభిప్రాయమును గూడఁ గైకొనుట యుత్తము మేమోయని దలంచెద.

దశ—దేవా! రాఘవుని యభిమతము నట్టుచే బుచ్చుకొందము గాని రాఘవుఁడు రాజుగాఁజేయఁబడుటకుఁ దగియున్న వాఁడని తమకుఁ దృష్టిగలదా?

వశి—రాజా! అందునఁగూర్చి వేఱయడుగ వలయునా? సకలవిద్యలయం దసమాన పాండిత్యంబు గడించి, బాహుబలంబున మిన్నగిచి, పెక్కు రక్కసుల నుక్కడగించి, సకల మునివందితుఁడై, రాజకార్యనిర్వహణ తంత్రజ్ఞుఁడై, ప్రజామోదితుఁడై, సుగుణాభిరాముఁడై, శాంతమూర్తియై, సత్యవాక్యపరిపాలనా దక్షుఁడై, యశోన్వితుఁడై, పరమ పావనమూర్తియై, వెలుఁగొందు శ్రీరామచంద్రమూర్తియేమి? సింహాసన మధిష్ఠింప నర్హుండు గాకుండుటేమి? అందునఁగూర్చి మీకట్టియనుమాన మేలఁ గలిగినదో తెలియకున్నది.

దశ—ఋషిచంద్రమా! అందులకుఁగాదు!

గీ. భారము వహించియెఱుఁగని ♦ బాలుఁడగుట
రాజ్యతంత్రంబు నేరని ♦ ప్రాయమగుట
కష్టసుఖము లెఱుంగని ♦ కార్యమగుట
బుడుతఁ డర్హుఁడె? యిప్పుడం ♦ చడిగినాఁడ.

వశి—అట్టి యనుమానములతోఁ బనేమియు లేదు. రాజా! రాముఁడన సామాన్యుఁ డనుకొనుచుంటివా? బాలుఁడని దలంచుచుంటివా? ఆతం డవమూర్తి యనియు, సకలకార్య నిర్వహణ దక్షుండనియు, దుష్టశిక్షణ, శిష్టరక్షణ పరాయణుండనియు, నీవఱకే వినియుంటివి. అంతియ గాక నీ బాల్యమునందే మొన్న మొన్న యతఁడొనర్చిన యద్భుతకార్యంబుల మఱచితిరా?

మ. సవనంబుల్ బరిరక్షణంబు సలుపన్ ♦ చాపంబునుల్ దాల్చి శా
త్రవ నిర్మూలముఁ జేసి, గాధిసుతుచే ♦ తన్ మన్ననల్ జెందఁడే?
శివచాపం బవలీలఁ ద్రుంచి, మునులా ♦ శీర్వాదముల్ సల్ప రా
ఘవుఁడా జానకిఁ జెట్టఁబట్టఁడొకొ? లె ♦ క్కా? వానికీకార్యముల్.

మఱియు,

గీ. పతియిడిన శాపమున రాయి ♦ వలెను బెక్కు
వత్సరంబులు పడియున్న ♦ వనిత నిట్టె
కాలితోఁ దాకి శాపమో ♦ క్షంబొసంగి
వడి నహల్య నతండు గా ♦ పాడలేదె?

అంతియగాక నదృశ్యరూపులై మింటనిలచి ముని యధ్వరంబున రక్తధారలు గురిపించిన రక్కసులఁ గిక్కురుమనకుండ నుక్కడగించినదెవరు? రాముఁడేగదా? ఇఁక రాచకీయ వ్యవహారములయం దందురా?

గీ. కొలువుఁ దీర్చియున్న వే ♦ ళలను మీదు
యంకపాళిని ముద్దుగా ♦ నధివసించి
రాజ్యతంత్రంబులను నతి ♦ శ్రద్ధ నెఱిఁగి
తగిన జాగ్రతలోనుండె ♦ దశరథేశ.

కాఁబట్టి నిస్సంశయముగ రామచంద్రమూర్తిని ప్రభునిగాఁ జేయ వచ్చును.

దశ—అట్లయిన సచివరా! సుమంత్రా! నీవేగ శ్రీరాము నిటకుఁ దీసికొనిరమ్ము.

సుమం—చిత్తము. (అని వెడలి రామునితోఁ బ్రవేశము.)

రాము:—గురువర్యా; తండ్రీ! నమస్కృతులు.

దశ, వశి—శ్రీరామచంద్రా! కామితార్థఫల సిద్ధిరస్తు. కూర్చుండుము.

రాము—(కూరుచుండి) జనకా! అత్యంతావసరంబుగా నన్నుఁ బిలువనంపిన గతంబెఱిఁగించి నావీనులకు విందొనర్ప వేఁడెద.

దశ—కుమారా!

గీ. సుతులు, సుతులంచు, వాపోయి ♦ క్రతువొనర్చ
యీశు కరుణారసమున గ్ర ♦ హించినాఁడ
సకల సౌభాగ్యయుతుల వి ♦ శారదులను
మాననీయుల, సుగుణాఢ్యు ♦ లైనమిమ్ము.

అట్టిమీరు,

గీ. విధివిరామము లేకుండఁ ♦ బెద్దకాల
మును భరించిన యీభార ♦ మును వదల్చి
తగిన విశ్రాంతిఁ గలిగించి ♦ దైవచింత
నమున నన్నుంతురని నమ్మి ♦ నాఁడ మదిని.

అందఱిలోనను బెద్దవాఁడవు. మదాజ్ఞా పరిపాలనా దీక్షాబద్ధకంకణుఁడవు, సత్యమార్గానువర్తివి. శమదమాది సద్గుణంబులు గలిగి రాజిల్లువాఁడవు. నీతివిశారదుఁడవు. నీకు విశేషించి తెలుపవలసిన విషయంబులు లేవు. కాన,

గీ. తగినదార్ఢ్యంబు లేదు, వా ♦ ర్ధకమువచ్చె
నొడలు ముడుతలుపడె శ్రమం ♦ బడంగంజాల
యీధరాభారమును మోసి ♦ యింపుమీరం
దగిన విశ్రాంతినొందఁగు మో ♦ తనయనాకు.

రాము—తండ్రీ! తమయాజ్ఞయైనచోఁ దప్పదు కాని,

గీ. ప్రాయమున బాలుఁడను ధరా ♦ భారమూని
కార్యములఁ జక్కఁబఱుపఁగాఁ ♦ గలుగుదొకొ?
బహువిధ విషయంబులను నేర్వ ♦ వలెనుగాదె
గురులసన్నిధి శుశ్రూషఁ ♦ గోరిచేసి.

అంతియఁగాక,

గీ. భరతశత్రుఘ్ను లిటలేరు ♦ వారు లేక
నట్టివైభవమెట్టులే ♦ సందఁదగును
వారువచ్చినపిదప మీ ♦ వాంఛరీతి
సలుపరాదొకో? మీదుము ♦ చ్చటలుదీర.

దశ—బాలకా! నీవుచెప్పిన విషయంబు లాలోచింపఁదగినవేగాని నాస్థితియంతయుఁజూడ యేవేళకేమో యనునట్లుగా నుండుటచే జాగ్రదావస్థయందుననే నిన్నుఁ బట్టభద్రునిఁగావించి నాముచ్చటఁదీర్చుకొందమనుభ్రాంతిచే నిట్లు తొందరపడుచుంటిని. అంతియేగాని భరత శత్రుఘ్నులు లేరనుచింత నాకుమాత్రము లేదా? వారువచ్చుదనుకఁగూడ జీవింపఁగలుగుదుననుధైర్యము నాకంతకంత కంతరించుచున్నయది. ఇఁకరాజకీయ వ్యవహారములను నేర్చుటవిషయమంత గొప్పదికాదు. కాలక్రమమున నదియె పట్టుపడఁగలదు. దానికింతవిచారమేల? చూఁడు,

గీ. రాజ్యపరిపాలనాది మ ♦ ర్మములఁ దెల్పు
చుండ నీకండగా వసి ♦ ష్ఠుండు గలఁడు
సర్వ విషయంబులను దెల్పఁ ♦ జాలి నీకుఁ
దోడు నీడ గమన సుమం ♦ త్రుండు నుండు.

తెలియని విషయంబుల వారివల్లఁ గ్రహించుచు, నీతివిశారదుండ వై చక్కఁగా రాజ్యంబును బరిపాలించఁదగును? కాన నాయాజ్ఞ నుల్లంఘింపవని దలంచెద.

రాము—తండ్రీ! తమయాజ్ఞ యుల్లేఖ్యమైనచో మారుమాటాడఁగలనా? మీయిష్టానుసారంబుగఁ గానిండు.

దశ—అట్లయిన నో వశిష్ఠ భగవానుఁడా! రాముండు నాయాశయమీడేర్ప బద్ధకంకణుఁడయ్యెఁ గావున సుహుమూర్తము నిశ్చయింపఁ దగును.

వశి—రాజా! దానికింక విచారణ మేల? ఎల్లుండి బాగుగ నేయున్నది. పట్టాభిషేక మహోత్సవ మవశ్యమాచరింపఁదగును.

దశ—చిత్తము, రామా! గురువులగు వశిష్ఠులవారు ఎల్లుండి సుముహూర్తము నిశ్చయించినారుగాన,

గీ. నీవు సతితోడ నుపవాస ♦ నియతినుండి
నిద్రయునుపోక హరిని ధ్యా ♦ నించుచుండి
రేపు గడుపుచు నెల్లుండి ♦ తేడుగాఁగ
సిద్ధముగ నుండు పట్టాభి ♦ షేకమునకు.

రాము—తండ్రీ! అట్లనే గావింతును. నాకింక సెలవొసంగెదరా?

దశ—మంచిది పోయిరమ్ము.

రాము—గురువరా! వందనంబు. తండ్రీ! నమస్కరింతును. (అని నిష్క్రమించును.)

దశ—మంత్రిపుంగవా! నగరవాసులెల్లరుఁ దమగృహంబులఁ జక్కఁగ నలంకరించుకొనునట్లును, రాజమార్గములన్నియుఁ బరిశుభ్ర పరచి చక్కని యేర్పాటు లొనర్చునట్లుగను, రాజమందిరము లన్నియుఁ దగురీతిని జక్కపఱచునట్లును, బట్టాభిషేకమహోత్స వంబునకువలయు సమస్తవస్తువులను సమకూర్చుటయందాయా యుద్యోగులు, సేవకులు, నప్రమత్తులై మెలంగు నట్లును, దగు కట్టుబాటులఁ జేయుటయేగాక, వ్యవధిలేనందున రాజబంధువు లెల్లఱకు సకాలములోఁ జేరులాగున శుభలేఖ లంపుటయందు వలయు నేర్పాటులఁ గావించి, కరితురగాది సందోహంబును రాజలాంఛనములగు దిరిసులతోడ నలంకరించుట కనువగువార ల నియమించి, మహోత్సవమునకు వలయు మంగళవాద్యకులను, తదితర వాద్యకులను, రప్పించి వర్ణవిభేదములేక సమస్తజనులా హ్వానింపఁబడుట కేర్పాటులఁ జేయించి యీమహోత్సవంబున నెట్టికొఱతలు లేకుండఁజేయు భారమును వహించి, తత్కార్య నిర్వహణంబున క్షేమాత్రంబును జాగుచేయక పొమ్ము.

సుమం—చిత్తము. సెలవుఁ గైకొనియెదను. (నిష్క్రమించును.)

దశ—దేవా! పట్టాభిషేక మంటపాలంకారాది కార్యము లొనరింపిం చుభారము స్వయముగాఁ బూనుకొంటిని. గావున నేటికి గొ లువుజాలించి పోవుదమా?

వశి—మంచిది. అట్లనే పోవుదము.

(అందఱు నిష్క్రమింతురు.)

---



శ్రీరామచంద్ర.

# పాదుకాపట్టాభిషేకము.

## ద్వితీయాంకము.

కైక మందిరము.

(ప్రవేశము మంథర.)

మంథ—(తనలో) ఏమీ! ఈ పురాలంకార వైభవము. గోడలకు వెల్లలు వేయువారు, జేగురులు పూయువారు, తోరణములు గట్టువారు, పందిళులు వేయుచున్నవారు ఎందులకో? (వినుట నభినయించి) ఈప్రబల కోలాహలమేమి! ఆమంగళవాద్యంబు లెచ్చటవో? ఓ, బ్యాంహు లేగాదు, బాకాలేగాదు, తాషాలేగాదు, రండోళ్ళేగాదు, ప్రజలందఱు బరుగులెత్తుచున్నా రెచ్చటికి? నిన్నటి దినమున లేనివైభవము నేడిట్టి కలిగినదేమిచెపుమా! ఈబండ్లన్నియు వస్తువులను సరఫరా చేయుచున్న వెచ్చటికో? అదేమి! ఆ అగుగులమీఁదఁ జేరి పెట్టెలలోఁ బాతిపెట్టిన దిరీసులదీసి బాగుచేయు చున్నారు. ఎటు దిలకింతుమన్నను శ్రీహరినామ సంకీర్తనంబునఁ దన్మయత్వంబుఁ జెందినవారలే గాన వచ్చుచుండిరే? అసంఖ్యాకములగు దీపములఁబెట్టి భానుతేజంబును వెలవెలఁ బాఱునట్లు జేయుచున్నారు. తీరుగాఁ బంగనా

మంబుల దిద్ది యీ పరుగులెత్తుచున్న సాతానులు తమ కట్టు పంచె లేగతినున్నవో కూడ చూచుకొనకున్నా రేమంత యుపద్రవము వచ్చినదో! ఈహడావుడుల కిది కారణంబని తెలుపువారొక్కరును గానరారేమి? కొత్తిమేర కట్టలవలెఁ బిలకల నెగరవైచుకొనుచు తమ ఝూంగీచెంబులఁ జేతఁ బుచ్చుకొని కోలాహలము చేసికొనుచు నంతతొందరగాఁ బోవుచున్నా రెందులకు? (చెవియొగ్గి) ఏమిటాచాటింపు వింద్రము. ఓరీ! జాంఘికుఁడా ఏమనుచున్నాఁడవు. రామచంద్రయ్యకుఁ బట్టాభిషేకమా? అందులకా? యీకోలాహలములు, యీపటహములు, యీయురుకులు, యీభజనలు, యీమంగళవాద్యంబులు, యీ పురాలంకారములు? ఏతావున నెచ్చటవేడుక యైనను నాకన్నులాఱఁ జూడఁ జాలనే? అందునను శ్రీరామచంద్రుని పట్టాభిషేకమునకు నేనోర్చుకొనా? ప్రజల విరోధియు నా గర్భశత్రువునగు రాముని కింతటి వైభవము జరుగుచుండఁగా నేనా యూరకొనునది? అది నేమి వైపరీత్యమో గాని రామనామంబు నాచెవులఁ బడినతోడనే నాహృదయంబునఁ గ్రోధాగ్ని ప్రజ్వరిల్లుచుండును. స్వభావ సిద్ధముగ నీర్ష్యావేశాలనగు నేనిట్టి వేడుకఁ జూడఁజాల! చూడఁజాల! ముమ్మాటికిని జూడఁజాలను. చిన్ననాఁడు చేసిన పరాభవమునకుఁ బ్రతీకార మనుకొననిమ్ము. దుష్టస్వభావనై ప్రతి శుభకార్యమునకిట్లే విఘ్నమొనరించుచుండు దనుకొననిమ్ము. ఎట్లయినను నేనిప్పు డీకార్యమునకు భంగముచేసి తీఱవలయును. లేనిచో నాయూరుపేరు గూడ రూపుమాయును. కావున నా నెచ్చెలియగు కైకేయి నెట్లయినఁ బ్రోత్సహించి నాయత్నమున సఫలీకృత మనోరథురాల

నయ్యెదఁగాక. (ప్రకాశముగా) కైకేయీ! కైకేయీ! పుట్టి మునిఁగిపోవుచుండ, హాయిగా నిద్రించుచుంటి, వేమమ్మా! లెమ్ము.

కైక—(లేచి తొందరగా) ఏమిమంధరా! ఇప్పుడింత తొందరగా నిద్ర లేపితివి? ఇంకను దెల్లవారనట్టుల లేద?

మంధ—ఇంకను దెల్లవాఱలేదా? మన జన్మయే తెల్లవాఱినట్లున్నది. తేపటినుండి మన బ్రతుకడుగినా? లేలెమ్ము.

కైక—మంధరా! ఏమి? ఏమి?

మంధ—ఇంకా యేమి యేమనుచున్నావా? నీకేమైనఁ జెముడువచ్చెనా? వినుమా కోలాహలము గొంతులు బ్రద్దలగునట్లుచేయుచున్న ఆ హరినామభజనలు, నానావిధ మంగళ వాద్యంబులు, ఇట్లు వచ్చి చూడుము. పురంబాతియు నెట్లలంకరింపఁ బడినదో?

కైక—అవును. ఈహడావుడు లన్నియు నెందులకో?

మంధ—ఎందులకా? రాముపట్టాభిషేకమఁట.

కైక—మంధరా! నిజముగనే?

మంధ—ఇందబద్ధము కూడనా?

కైక—ఆహా! ఎట్టి శుభవర్తమానము వినఁగల్గితిని?

గీ. సత్యమార్గానువర్తి వి ♦ శారదుండు
సుగుణములఖని రాముఁడీ ♦ క్షోణినేలు
భాగ్య మెన్నాళ్ళకబ్బెఁ బా ♦ వనతఁ జెందె
వీనులీనాఁడు శుభవార్త ♦ వినిన కతన.

మంధ—కైకేయీ! ఎంత తెలివి తక్కువదానవమ్మా! రాముపట్టాభిషేకవార్త నీవిప్పుడు వినినది. భరత పట్టాభిషేకవార్తగాదు.

కైక—అవును. శ్రీరామచంద్రుని పట్టాభిషేకవార్తయే నేను వినినది.
మంథ—అది నీకు శుభదాయకమా ?
కైక—కాదా ! మంథీ.

గీ. సర్వ సుగుణాభిరాముఁడు ♦ సార్వభౌముఁ
డగుచు మమ్మేలుచుండఁగా ♦ నంతకన్న
భాగ్య మింకొండుఁ గలుగునే ♦ బడయు మే? సు
ఖంబులను రాము పరిపాల ♦ నంబు క్రింద.

మంథ—ఇంత పిచ్చిదాన వేమమ్మా ! రాముఁడే ప్రభువైనచో నీవే మగుదువో గుర్తెఱుంగ కున్నావే ?
కైక—ఏమగుదును ?
మంథ—ఏమగుదువా ? దాసివగుదువు. ఎందులకును కొఱమాలిన దాన వగుదువు. ఇంతటినుండి పుట్టింట నుండవలసినదాన వగుదువు. కౌసల్యాదేవికి బరిచారికగా నుండవలసినదానవగుదువు.
కైక—మంథరా ! ఏమది ? నేఁడిట్టులాడు చుంటివి. నీకేమైన మతి పోయెనా ?
మంథ—ముందు రానున్నస్థితిగతుల నెఱుంగక పోవుటయేగాక కూడు మిక్కిలి నాకు మతిపోయిన దనుచుంటివిగా ? పోనిమ్ము. నా మాటల కేమిగాని కైకేయీ ! మహారాజునకుఁ గడసారపు భార్యవు. నీవనినఁ బంచప్రాణంబులర్పించు చుండువాఁడుగదా? మూఁడు దినంబులనుండి నీగడప చాలునకైన వచ్చెనా ? చెప్పు.
కైక—అందులకుఁ గారణమేమిగా నూహింతువు ?
మంథ—ఏమిగా నూహించెదననినఁ గౌసల్యా మహాదేవిమీఁదమక్కువను వదలలేక నీ మూఁడు దినంబులనుండి యచ్చటనేఁదిష్ఠ

వేసికొని కూర్చుండుటచేత ఆపట్టపుదేవి మాయలోఁబడి యీ కృత్రిమపు టాలోచనముఁ జేయుచుఁ దీఱిక లేక, ఆరాణిగారిని యీవిధముగా బహూకరించ వలెనని, ఆవిడచే మెప్పులఁ బడ యుపలయునని, ఆవిధముగా నిన్ను వంచనఁ జేయవలయునని యీవైపునకు రాకుండె. తెలిసినదా ?

కైక—ఆమెయం దెక్కువ మక్కువఁ జూపుచు మనవైపునకు రాకుండుటచే మనల నగౌరవపరచినట్లుఁ దలంచవచ్చు ననుకొనుము. రామపట్టాభిషేకవార్త మనకు వంచన మగుటెట్లు? రాముఁడు సుగుణాభిరాముఁడు. జ్యేష్ఠసుతుఁడు. మునిపూజితుఁడు. వినయవివేకశీలుఁడు. దైవభక్తి పరాయణుఁడు. సూనృతవచస్కుఁడు. అట్టివాఁడు రాజగుట సర్వజన సమ్మతమే యగునుగదా ? విరోధివర్గముగూడ నాతని రాజతికమునే గోరుచుందురు.

మంధ—అవ్వను. ఇన్నివిశేషణములుగలిగిన వాఁడగుటచేత నే కాఁబోలు కన్నుమిన్నుఁ గానక నన్నుఁ జావమోదఁ గాడితెజ్జు లందఱి రొక పెద్ద లోపముగాదని, రాముని సుగుణ సంపత్తికది యొక లోపకారణ మగునని యీప్రస్తావనయే రానీయక నాతఁడే దైవతుల్యుఁడని పొగడఁజొచ్చి యీమహారాజు వెనకఁ జేరి తాళము వేయుట మొసలు పెట్టిరి. ఆహా ! రాముని శాంతము, రాముని వినయత్వము, ఏమని వర్ణింతును ?

కైక—ఏమీ ! రాముఁడా ? నిన్నా ? తిన్ననా? ఎంతమాట! ఒక్కనాఁడేనిఁ జెప్పవైతివి ? పోనిమ్ము. మంధరా ! తన్నినాఁడనియే యనుకొందము!

గీ. బాలుఁడౌటను; ఆటాడు ♦ వేళయందుఁ
దగిలెనేమొ పదంబు, రా ♦ ద్ధాంత మేల

దానికింతగ ? నంతమా ♦ తాఁకిన రాము
పైనిఁ గక్షను వహియింప ♦ భావ్యమగు నె ?

మంథ—అవునమ్మా ! అవును. నీవు మీవారి మాటల మాటాడక నాపక్షముగా నెట్లాగుదువు ? ఏమో ! ఒకయూరిలోఁ బుట్టి యొక్కచోఁ బాలుఁ ద్రావినవార మగుటచేత నామాత్రమైన నభిమాన ముండకుండునాయని యనుకొంటిని గాని నీవింత దానవా ? ఎవరి కడుపులో నేమి యూహాలుండునో యెవ్వరు చెప్పఁగలరు ?

కైక—ఓసి పిచ్చిదానా ! అజ్ఞాన దశయం దట్లొనరించినాఁడేమో యంటినిగాని రాముఁ డొనర్చినది లోపము గాదంటినా? చేసిన లోపము చిన్నదగుటచే నింతటి కార్పణ్యము వహించుట మన కుఁ దగునా ?

మంథ—కార్పణ్యము వహించి రాముని కొట్టుమనిగాని, దిట్టుమని గాని, బాధపెట్టుమనిగాని, వధించుమనిగాని చెప్పుటలేదు. నే జెప్పఁబోవునది నీ బాగుకొఱకేగాని నాయొడిలోనేమో గుఱిపిఁ తువనిగాని, సిరిసంపదలు వచ్చిపడునవనిగాని తలంచలేదులే !

కైక—మంథరా ! అంత కోపమెందులకు ? నా బాగుకొఱకు నీవు చెప్పఁదలంచినదేమో చెప్పుము.

మంథ—ఆరాముఁడు రాజైనప్పుడు మన దశలు తొలంగునని చెప్పు చుంటిని. ఈవఱకే పైచూపులు చూచుచున్న కౌసల్య మన నెత్తిపై నెక్కి కీలుబొమ్మల నాడించినరీతి నాడించఁ గలదు. భరతుఁడు గుఱ్ఱములను గాయవలసి వచ్చును. పోనిమ్ము దీని కేమిగాని కైకేయీ ! యివన్ని యటుంచుము. కడసారపు భార్యవని యనురాగము లాలికించునీభర్త, సదా నీపదధ్యాన

మే సకలమ్మని నమ్మి చరించు నీభర్త, నీనామస్మరణ మాత్ర
మునసే యుబ్బి తబ్బిబ్బులై యొడలెఱుఁగక గంతులిడుచు
లొట్టలువేయు నీభర్త, నీ ముఖారవిందమును దిలకించినంతనే
చంక లెగఱవేయు నీభర్త, మూఁడు దినంబులనుండి మనచాయ
కురాకపోఁగా పోని ! రేపు శ్రీరాముని పట్టాభిషేకము జరుగఁ
బోవనున్నది. దీనికై యేమందువని నిన్నడుగుట కేరినైనఁ బంపె
నా ? అదిగాక మేనమామల యిండ్లయొద్దనున్న భరత, శత్రు
ఘ్నులఁ దీసికొనిరమ్మని యెవరినైనఁ బంపెనా ? మీ గోడ
వయే తలపెట్టడయ్యె. మీగుమ్మము ఛాయకే రాఁడయ్యె. ఇది
యిట్లని ఆలోచింపఁడయ్యె ! ఇన్ని విధములగు వంచనములు
జరుగుచున్నను మహారాజునకు నా మీద మక్కువ మెండని
దిక్తటములు మాఱుమ్రోగునట్లు పలికెదవు ! ఏమి ప్రయోజ
నము ?

కైకే—మంథరా ! పాపమా మహారాజెట్టి కపటంబుల నెఱుఁగఁడు.
కౌసల్యా ప్రబోధితుఁడగుటచేనో యిట్టి విపరీతచేష్టలకుఁ బాల
గుట తటస్థించుచున్నది. ఏసంగతులెట్లున్నను శ్రీరామచంద్రుని
పట్టాభిషేకవార్త నాతోడఁ జెప్పనఁ గాదింతునా ? సచేసుని
యడ్డుపడుదునా ? తన మహదైశ్వర్యములు నాకుఁ గట్టిపెట్టు
మనుచుంటినా ? రామభద్రునిమీద నాకేమేనిఁ బగయా ?
అట్టి దుర్బుద్ధులు నాకులేవే ? నిజముగాఁ గౌసల్యకు నావిష
యమున దురభిప్రాయము గలదుసుమా.

మంథ—ఓ ! కేకయరాజపుత్రీ ! మహారాజు ఏపాప మెఱుంగఁడనుట
నిశ్చయమేగాని యీపట్టాభిషేక ప్రయత్నములు చాలకాలము
నుండియే జరుగుచున్న ట్లద్దమువలెఁ గనఁబడుచుండఁగా ఒక్క

నాపైన నీతో సంప్రదించెనా ? మీయిరువురకేకాంతప్రదేశము దొరికినదిగాదా ? ఈ విషయమునుగూర్చి యేమాత్రమును దెలియనీయరాదని అవుతలఁ గౌసల్యాదేవిగారి యాజ్ఞయైయుండెఁగా నీకుఁ దెలియుడమేనా ? ఈ విషయలన్నియు నిట్లుండఁబట్టియే తమ ప్రయత్నముల కంతరాయంబు వాటిల్లునని భరత, శత్రుఘ్నుల నిటనుండి వెడలఁబంపినది. తెలిసినదా ? లేనిచోఁ గాలవ్యవధి లేకుండ, కొడుకులు చెంతలేకుండ, యేమంతముంచుకొని పోయినదని యింత త్వరితముగ లగ్నము పెట్టించవలసి వచ్చినది చెప్పుము ?

కైక—ఇదంతయుఁ గౌసల్యాదేవి ప్రోత్సాహముననే జరిగియుండునని దలంచెదవా ?

మంధ—ఆహా ! నిస్సంశయముగా ?

కైక—మంథరా ! రాజెంతటి మూర్ఖుఁడైపోయెను ? మన మిప్పుడేమి చేయుదము ?

మంధ—మనమా ! రామపట్టాభిషేకమునకు విఘ్నంబు గల్గింపవలెను. భరతుని రాజుగఁ జేయింపవలెను. ఇంత వెర్రిదానవేమి? చిన్నతనంబుననుండి చేతులమీఁదఁ బెంచిన భరతుఁ డొకరిక్రింద సేవకుండై చాకిరిచేయుచుండఁగా స్వభావసిద్ధముగనే యీర్ష్యవేసురాల నగు నేనుజూచి యోర్వఁగలనా ?

కైక—మంథరా ! ఏమి యజ్ఞానురాలవైతివి ? ఇది ఎంతైన నర్హమైన విషయమా ?

గీ. సవతిపైఁ గోపమున; రాజు ♦ సల్పుచున్న
కార్యములయందు నీర్ష్యను ♦ ఘనచరిత్రు

శ్రీరఘూత్తము పట్టాభి ♦ షేకమునకు
భంగమొనరింపఁ దలచుట ♦ పాడియగునె ?

మఱియు,

సీ. గాథేయుసవన దీ ♦ క్షనుబ్రోచి వాని యా
శీస్సులఁ బడసిన ♦ శీలుఁడతఁడు
పతిశాపవశమున ♦ గతిలేకనున్న య
హల్యనుఁ బ్రోచిన ♦ యాన్యుఁడతఁడు
శివధనుస్సునురెండు ♦ జేసి జానకిఁజెట్టఁ
బట్టిన జగదేక ♦ జెట్టియతఁడు
పరశురాముని నోటుఁ ♦ బరచి సాహస, విక్ర !
మంబును జాటిన ♦ మాన్యుడతఁడు

గీ. అట్టిశ్రీరాఘవుండు తేఁ ♦ డగుటఁజూచి
సంతసింపనివారలీ ♦ జగతినెవరు
గలరు? నేనట్టిచోరాము ♦ కార్యమునకు
భగ్నమొనరింప నప్పల ♦ పాలుగానె?

అది యంతయు నట్లుండనిమ్ము !

చ. భరతునికంటె నెక్కుడగు ♦ భక్తినిజూపుచునామెడన్ నిరం
తరముఁ జరించు నానుగుణ ♦ ధాముని రాముని పట్టభంగ మె
క్కరణి నొనర్పనేరుతు సు ♦ ఖంబుగ నుండిన కాలు ద్రోంపిలో
నిరుకఁగ నీయుమంచు వచి ♦ యించెద వెంతటి మూర్ఖచిత్తవో ?

మంథ—పోనిమ్ము. నాకేమి ? కౌసల్యాదేవి రాజమాతగా నుండుట
కును, రాముఁడు రాజుగానుండుటకును, నీవు నీకొమారునితోఁ
గూడ దాస్యవృత్తిలో నుండుటకును, నీవిష్టపడుచుండఁగా నాకు
కండియులాగున మధ్యనాకేమి ? ఏమో! బాల్యస్నేహముచేత,

కైక—రామునకు వనవాసమేల ?

మంథ—జ్యేష్ఠత్వ మీమాంస లేకుండఁ బోవుటకు.

కైక—మహారాజందుల కంగీకరించునా ?

మంథ—అదే గొప్పచిక్కు. నీసమర్థతచేత, నీ తెలివితేటల చేత, నీబుద్ధిసూక్ష్మముచేత, నీసరసవాఙ్మాధుర్యముచేత, నీయుపచారనైపుణ్యముచేత నీదివ్యాంబరభూషణాలంకార వైభవముచేత మహారాజును మెప్పించి, లాలించి యొప్పించవలయును.

కైక—మంథరా ! నేనేమన్నను నీకుఁ గోపమువచ్చునుగాని భరత రాజ్యాభిషేకమునకుఁ జిత్తము సమ్మతించినను రామువనవాసమునకు మాత్రము జిత్తము సమ్మతింపకున్నదిసుమా ?

మంథ—అదే తలతిక్క. భరతునకు రాజ్యమిప్పింపఁ దలఁచుకొన్నచో రాముఁడుండిన మనయాట లెంతమాత్రమును సాగవు. ప్రజామోదమును బొందఁజాలము. శాస్త్రమంగీకరింపదు. కాన పట్టాభిషేక విషయమెట్లుండినను మన ప్రయత్నములకు ముందు రామువనవాస మవశ్యకర్తవ్యము.

కైక—మంథరా ! నిజమే. అట్లయినచో నిట్లొనర్తును. నేనిప్పుడే యీ యలంకారములన్నియుఁ దీసివైచి, మలిన వస్త్రధారిణినై, కోపగృహమునఁ జేరి పడవలసిన పాట్లన్నియు శక్తివంచనలేకఁ బడి, సఫలీకృత మనోరథురాల నయ్యెదను.

మంథ—సరి యిఁక నేమి ! నీకొమరుఁడు రాజైనచో నింక మేమగుపడుదుమా ?

కైక—ఆచతురోక్తులన్నియు నిప్పుడెందులకు లెమ్ము ? అంతవఱకు వచ్చినప్పుడు చూచుకొందము. మహారాజు వచ్చు వేళయైనది

నీవింక నీప్రయత్నమున నుండుము. అదిగో కాళ్ళచప్పుడుగూడ వినవచ్చుచున్నది. నేనింక నాప్రయత్నములో నుండవలయును.

మంథ—ఏమో ! ఎట్టులీకార్యంబున జయంబుఁ బొందెదవో ఆభారమంతయు నీయందే యున్నది. పోవుచున్నాను.

కైక—అన్నిఁటికిని భగవంతుఁడే కలఁడు పోయిరమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)





శ్రీరామచంద్ర.

# పాదుకాపట్టాభిషేకము.



## తృతీయాంకము.

### కైక మందిరము.

(దశరథుఁడు ప్రవేశము.)

దశ—ఏమి ! యీఅద్భుతము. నిరతంబును గలకలలాడు యీసౌధము నేఁడేల కళావిహీనముగ నున్నది ? ఇందెవ్వరును గానరాకున్నారు ! పరిచారికలు గూడఁ గానరాకున్నారే ! కారణమేమి చెప్పుమా! నాయడుగుల జాడవినవచ్చినంతనే యెంతయో సంతసంబున నెదురుగావచ్చి సగౌరవముగ, నాదరణ పూర్వకముగ, లోనికిఁ గొనిపోయి ముద్దు ముచ్చటలఁ జెల్లించు నాయలివేణి, నా మురిపెములదొంతి, నారతనాలబంతి, కైకేయి నేడు రాదేమి ? పరియాచకమున కెందైన డాగనేమో ? ఓకేకయరాజపుత్రీ !

తు. పరిహాసంబునకంచు డాఁగి నను బ్రి • ప్పల్ బెట్టఁగానేల ? వే
గిరమ్మున్ వచ్చి కవుంగిలించి నను నీ • క్రీగంట వీక్షింపవే .

సరసోక్తుల్ బచరింపవచ్చు; ఝడిపిం ♦ పఁగావచ్చు నిందుండి యి
క్కురంగాక్షీ దవ్వులడాఁగియున్నఁ గనుఁగొం ♦ గాశక్యమే నాకిఁకన్.

మరియు,

మ. పరువెత్తం దగుదార్ఢ్యమా సమసె న ♦ బ్జాతాక్షి యేమూలఁ గి
క్కురుమన్నాదము లేక డాఁగితివొ? జం ♦ కుఁగొంకు లేకుండ మం
దిరము న్దాఁటితివొ? లేక యీవనమునం ♦ దే డాఁగితో? నిన్నుఁగన్
ద్వారపెట్టఁగ దోడఁగెఁగా మనంబుఁ బ్రియకాం ♦ తా! లేచి రారమ్మికన్

(మందిరంబులోనికిఁ బోవుచుండఁగనే గుమ్మముకడ నేలఁ బడియున్న కైకేయిని జూచి) ఆఁ ఆఁ కైకేయీ! కైకేయీ! ఏమి యీవిపరీతము? ఈరూపమేమి? ఈవస్త్రమేమి? ఈరా నేలపైఁ బరుండుటేమి? కురుల విరియఁ బోసికొని, భూషణ రాజంబులన్నియుఁ దీసివైచి, మలిన వస్త్రధారిణివై యీగతిఁ బడియుండుటఁ జూడ నేదియో గొప్ప విశేషకారణ మున్నట్టు లగపడుచున్నయది. (ముఖముఁ బరికించి) ఈమె మొగంబునఁ గ్రోధంబు తాండవంబాడుచున్నయది కారణంబేమి చెప్పుమా! కైకేయీ! పలుకవేమి? (మఱింత దగ్గఱకుఁజేరి) ప్రేయసీ!

మ. కనులన్ విప్పుము నీమనోహరుఁడఁ గ్రీ ♦ కంటన్ విలోకించి భూ
షణరాజంబుల వీడుచున్ మలినవ ♦ స్త్రంబొక్కటిన్ దాల్చి నే
లను బన్నుండియుఁ గ్రోధచిత్తవగుటే ♦ లా? తెల్పు నాచిత్తమం
దున సంతోషము గూర్తువేని వడిదీ ♦ ర్తుఁగ నీమనోభీష్టమున్.

తరుణీమణీ! లేలెమ్ము! నాపంచప్రాణంబులను నీయధీనం బందుంచి సకలంబు నీవయే యని నమ్ముకొని చరించు యీ దాసుఁడిత్తఱి నీక్రోధం బుపసంహరింపవయేని తాళఁజాలఁడు! తాళఁజాలఁడు!

చ సవతులు నిన్నుఁజూచి విర ♦ సంబగు మాటలనాడిరో ? తనూ
భవుని నిమిత్తమై భటులఁ ♦ బాసఁగ లేదని యల్కఁబూనితో?
భవనమువంక రాక పని ♦ పాటలలోన మునింగి తంచు నో
యువిదరో! కోపమూనితివొ?♦యున్నది యున్నటులన్ వచింపుమా.

నీవే నా ప్రాణమానధనంబులనియు, నీకీయకారణ కోపంబు దగదనియు దగ్గఱఁజేరి యిన్ని తెఱంగుల వేఁడుకొనుచుండఁగా మునుఁగుఁ దీయక, మూతిబిగుంచుక బరుండ ధర్మముకాదు.

(అని, మునుగుఁ దీయుచుండఁ గైకేయి విదలించుకొనును.)

శా. నాకర్మంబిప్పుఁడేమి కాలినది కాం ♦ తా! నాదుచిత్తంబునన్
జీకాకందఁగఁజేసి యిట్టులఁ బరీ ♦ క్షింపంగనుం దాసునై
నీకోర్కెల్ నెరవేర్తునంచు దెలుపన్ ♦ నీకింత పంతంబె ? అ
య్యో! కైకేయి క్షమింపుమింక నను న ♦ త్యుత్సాహ సంప్రీతితో.

కైక—(చివాలున లేచి) ఆపాపిష్ఠివిధాత నాలలాటంబున లిఖంచిన వ్రాతకు నాలోనేను విలపించుచుండఁగా నానుకండియలాగున మధ్యవచ్చి మదోన్మత్త వాక్యంబులాడి నావిచారమును మఱింత వృద్ధిపఱచు చుంటి వేమి ? నీకర్మమేమియుఁ గాలలేదు. నీవైఁ గోధము వహించునంతటి సమర్థతఁ గలదాననుగాను. సవతుల నిరసన వాక్యంబులతోడ నాకేమిపని ? నీవివ్వ డిచ్చుటకేల వచ్చితివి ? ఎవరికర్మము వారేయనుభవింతురు. ఈవృథాలాపము లేల ? ఈస్తోత్రపాఠము లేల ? ఈవినయ వేషము లేల? ఏటికీ యక్కఱకురాని చేష్టలు ?

దశ—ప్రాణేశ్వరీ !

కైక—అబ్బా! ఏమీ యీసంబోధనము? నాభిదగ్గఱనుండి వచ్చినవాక్యమేనా?చాలుఁజాలు ఊరకొనుము. విన్నవారుపరిహాసింతురు.

దశ—లోకుల పరిహాసములకు వెఱచి నాయనురాగముల కుప్పయైన నీపైని వాత్సల్యమును దిగఁద్రాగుదునా? నీదాస్యము మఱతు నా ? నాసుఖంబులఁ ద్యజింతునా ? ఏటికీవిరసోక్తులు ?

కైక—అవునవును ! నావివిరసోక్తులు. నీవిసరసోక్తులు. ఏమిసరసము మోడిపోవుచున్నది? నీవుపురుషుఁడవా? నేను స్త్రీనా? నాకునీవు పతివా ? నీకునేను సతినా ? ఆదినములువేఱు. ఈదినములువేఱు ! ఎందులకు నన్ను వృథావాగింపఁ జేతువు ?

దశ— కైకేయీ ? నేడిట్టుల విపరీతముగ మాటలాడుచుంటివేమి కారణము చెప్పు ? ఈవఱలో నెన్నఁడైన నన్నిట్టిచిన్నచూపుఁజూచి యెఱుఁగుదువా? నీవెట్టులాడుమనిన నట్టులనేయాడితిని. నిలువమన్నతావున నిలిచితిని. ఏదిచేయుమన్న నదియే చేసితిని గదా ? అట్టివాఁడనగు నేనిప్పుడేమివిరుద్ధముగాఁ బ్రవర్తించితి నని యీయాగ్రహము ?

కైక—ఈసరసోక్తులన్నియు నీమూఁడుదినంబులనుండియుఁ బట్టపురాణిగారియొద్ద నేర్చుకొంటివా ? నన్నుసమాధానపరచుట కివియన్నియు నేర్పఁబంపెనేమి ? పాపమాబిడ నాయొద్దకేలఁబంపున ? మతివిభ్రమమొందెంగాని యిదినో కౌసల్యాదేవిగారి యంతఃపురంబని త్రోవదప్పి వచ్చితివి. పరిచారికను దోడ్కొనిపోయెదను గాని కౌసల్యదగ్గఱకుం బొమ్ము !

దశ—

ఉ. నేరమొనర్చనైతిఁ దరు ♦ ణీమణి నీయెడ నుంతయేని, యీ
తీరున నాడరాదననుఁ ♦ దియ్యని పల్కులతోడ నీదగు
గోరికఁ దెల్పుదేని వడిఁ ♦ గూర్తును; దీర్తును నీదువాంఛ నీ
నీరసవాక్య జాలమిఁక నిల్పుము ♦ దాల్పుము శాంతముగా మదిగా.

కైక — ఈస్వస్తివచనంబుల కేమిలెమ్ము ? మా కేమి వాంఛలుండును ? ఆ వరములు, ఆ లాంఛనంబులు, ఆముద్దులు, ఆ ముచ్చటలు మా కెందులకు ? కౌసల్యాదేవిగారన్న అమ్మగన్న బిడ్డయగుటచే నావిడకే తీర్పుడు.

దశ — కైకేయీ ? అట్లనకుము. నీ ప్రసంగధోరణినిబట్టి చూడ నీవే మో నన్ను గోరినట్లు, నేను నెరవేర్చనట్లుగను దోచుచున్నది? ఏమేని నన్ను గోరితివా ? నేను కాదంటినా ? నీకు వాగ్దాన మొసంగి నీముద్దుముచ్చటలం జెల్లింపనైతినా ? నీ విషయమై యెన్నఁడేని యనృతము లాడితినా ? చెప్పుము. ఏల యీనిష్ఠురాలాపములు ?

కైక — అవును ? కోరుకొన్నవన్నియు నెరవేర్చుదాతలు, ఆడితప్పకుండునట్టివారు, జ్ఞాపకము లేదా ? మొన్న మొన్న జరిగిన విషయము ?

దశ — నేనా ? అనృతమాడినది, నీవిషయమేనా ?

కైక — ఇతరులవిషయమైనచో నబద్ధమాడుదురు కాఁబోలు ?

దశ — దేవీ ! ఎందులకట్లనెదవు ?

గీ. పావనంబైన యిక్ష్వాకు ♦ వంశమందు
జననమందిన వారల ♦ సత్యమన్న
మండిపడెదరు సుమ్మి యీ ♦ మాడ్కి నేల
పాపములకొడిగట్టఁగఁ ♦ బాల్పడెదవు.

అదియట్లుండనిమ్ము నిన్న మొన్న నే జరిగిన యంశమునుగూర్చి మరచితివా యంటివి. ఆవిషయ మెద్దియో దెల్పుము.

కైక — నేను దెల్పవలయునా ? జ్ఞాపకము లేదా ?

దశ—వార్ధకదశయందు. భూతకాలవిషయంబులు జ్ఞప్తియుండుట దుర్లభముగాదా ?

కైక—ఓహో ! అట్లనా ?

మ. అపరబ్రహ్మయటంచుఁ బేర్వడిన వి ♦ శ్వామిత్రుఁ డానాఁడు
సత్కృపమై రామునిఁబంపుమంచు ననుఁ బ్రా ♦ ర్థింపంగ నేమంటివో
యపుడేపోయెనె? యింతలోనె మఱుపా ♦ హా! యేమి? యిక్ష్వాకువం
శపురాజేంద్రుల ధర్మవన్నములు చా ♦ ల్పాతేల యీవాదముల్

దశ—ఏమీ ? విశ్వామిత్రుఁడు రామునిబంపుమన్నప్పుడే నబద్ధమాడితినా ? కైకా ! సవనరక్షార్థమై ముద్దుకొమరుని గాధేయు వెంటఁబంపలేదా ?

కైక—ఆ ! పంపకేమి?

గీ. ఎంతరాద్ధాంతమయ్యె ? నా ♦ కొందరెంద
ఱెన్ని [illegible]గులఁ జెల్పిరి ? ♦ యెన్నిగతుల
వేదనల[illegible]దినావు ? శ ♦ పించునేమొ
యంచు భయముననఁగాదె బం ♦ పించినావు ?

దశ—దేవీ ! ఎన్నఁడో జరిగిన యీయుక్కటుకుమాలిన విషయంబులఁ ద్రవ్వి నామానసంబు నేల నొరాటపఱచెదవు ? నీకిప్పు డావశ్యకములగు విషయములఁగూర్చి మాట్లాడరాదా ? కోరికలేమైననున్నఁ గోరుకొనరాదా ? చేతులఁ గట్టుకొని నీమనోభీష్ట మీడేర్తును. త్వరితంబుగఁ జెల్పుము.

కైక—చెల్పుట కేమున్నదిలెండు. తీర్పుట దుస్తరమగునేమోయని యోచించుచున్నదానను: మీచిత్త మసత్యమునకు వెనుదీయదనియు నందిననట్టి సందర్భంబున వాదంబులనుగూడఁ బట్టుకొనునంతటి సమర్థులనియు మీవాగ్బంధంబు మధుపూరితమగు విషఘటం

బనియుఁ బూర్తిగాఁ దెలియుచున్నది. ఏతావంతకాగొడుగుపట్టు మీప్రవర్తనము సంపూర్తిగాఁ దేటపడినది. పేటుదాటి తెప్పఁ దగులవేయు మీరఘువంశజుల నైజస్వభావము సంపూర్ణముగ బోధపడినది. నేను కోరుకొన నక్కఱలేదు. మీరీయునక్కఱయును లేదు ఎట్లయితేనేమి.

గీ. దశరథుఁడు సత్యసంధుఁడు ♦ దప్పఁబోఁడు
నోటితో నన్నదాని యు ♦ న్మాటజగతి
నిలుపుకొననెంచి పొలఁగు నీ ♦ కెర్పుఁజూచి
సంతసించుచు నున్నారు ♦ జనులురాజ.

అంతియేగాని కడుపులో నెంతటి యూహాలున్నవో పరిశీలించినవారేరి ?

దశ—తరుణీమణీ ! నాకు వారివీరి పరిశీలన మెందులకు ? స్వానుభవ చిత్తవు నీవు కలవుగదా ? నీయెడ నేనొనర్చిన దోసమేమున్నదో చెప్పుము. దిద్దుకొందును. అట్టిపనిని మఱచిపోయ్యుని నిన్నుఁ బ్రార్థించుకొందును. పిచ్చిదానా ! వెఱ్ఱివానినిజేసి. వృథా కాలక్షేపమొనర్చి నన్నాడింపఁ జూతువుగాని నీకుమాత్రము నాపైఁ గోపమా ? ఏదియో అతుణికి మట్టిదగుట నిట్లు వికృతాకారమున గానుపించితివి. చెప్పుము.నీకేమికావలయునో ?

గీ. రత్నహారంబులో లేక ♦ నూత్నములగు
జిలుగువలువలో; మాడలో ! ♦ బలురకముల
హయములో, కరులో, గోరు ♦ మబలవేగ
దెల్పుదువయేని నీకోర్కెఁ ♦ దీర్చువాఁడ.

కైక —వీటిలో నేవితక్కువగానున్నవని నేకోరుకొనవలయును.

దశ—పోనిమ్ము ఇవికాకున్న నీయిచ్చవచ్చినవి కోరుకొనుము.

కైక—కోరుకొనినచో మీకసమ్మతములైన నానోటివెలితియేగదా?

దశ—సుందరీ! అటులెన్నటికినిదలంపకుము.

గీ. ధనముపోయిన, రాజ్యంబు ♦ ధ్వంసమైన
రవికులోద్భవులాడ నే ♦ రరు సుమీ యను
బద్ధములనేల యీలీల ♦ వాదులాడఁ
వేదనలముంపఁ జూతువు ♦ వెలదినీవు ?

కైక—అట్టిప్రగల్భములాడుట ప్రతివారికినైజస్వభావమేగాని నేఁగోరుకొనున వెట్టికోరికలైనను దేవా! తీర్చుటకు సంసిద్ధులైయున్నారుగదా?

దశ—దేవీ! ఇంకేటియనుమానము.

మ. భవదీయంబగు వాంఛలన్నిఁటిని దీ ♦ ర్పఁగఁ గంకణంబూని రా
ఘవుపై నొట్టునుబెట్టు కొంటినిఁకఁ గై ♦ కా! వైరమేకాంత చి
త్తవునై శంకఁద్యజించిపల్కుము భవ ♦ ద్వాంఛల్ వడిఁదీర్చెదన్
రవివంశంబున ఖ్యాతిఁగాంతుఁ జెలువా ♦ రన్ జేయుమీ యన్నిఁకన్

కైక—నాథా! అంతయొట్టును బెట్టుకొంటిరిగాన నాకోరికలఁ దెల్పుకొందును. పిమ్మట నన్ను పరాభవము చేయవలదుసుమీ! అయినను హృదయేశ్వరా! నేను నూతనముగానిప్పుడు కోరుకొననేల? నాకిదివరకే రెండువరంబుల నిచ్చియున్నారుగదా!

దశ—ఎప్పుడు?

కైక—ఎప్పుడా! మఱపయ్యెనా? నాథా!

గీ. శంబరాసురునకు మీకు ♦ జరిగినట్టి
బవరమందున నేఁదోడు ♦ పడగ నాకు
వరములను రెంటి నొసగ నే ♦ వలసినపుడు
కోరుకొనెదన సరెయని ♦ మీరలనరె ?

దశ—ఎంత దానవే? కైకేయీ! ఆదానవయుద్ధ మిప్పటిదా? ఎన్నఁడో జరిగిన విషయమును వార్ధక్యదశ ననుభవించుచున్న నాకు జ్ఞాపకముండునట్లు చెప్పుము.

కైక—చమత్కార వచోరచనలకును, సరసములకును, బ్రతిమాలుకొనుటకును, లేని వార్ధక్యత ప్రాతవిషయముల జ్ఞప్తికిఁ దెచ్చుకొనుటతో సద్దువచ్చును గాఁబోలు.

దశ—ఈమాటల కేమిలెమ్ము. ఆరెండు వరము లేవియో యిప్పుడు కోరుకొనుము. నావలనఁ గైకొనుము. ఇంతమాత్రమునకు,

గీ. కురులు విరఁబోసికొని పాత ♦ గుడ్డనొకటి
గట్టి, నగలనుదీసి జే ♦ కాకొకింత
తేక రానేల బడుకొని ♦ యీకరణిని
క్రోధచిత్తవుగానేల? కోమలాంగి.

మారాతి బిగించితివి. ముసుఁగుఁ బెట్టితివి కనుబొమ్మలుముడి వైచితివి. ముసుఁగుఁ దీయఁబోవ విదలించివైచితివి. నేను రానా? నీమనోవాంఛ లరయనా? నడుము గట్టుకొని నీ కోర్కెలీడేర్చనా? ఇంతలో నేమి పుట్టిమునిఁగి పోయినదని నీ వాయాసపడితివి? నన్నేల యాయాసపెట్టితివి?

కైక—కోరుకొనుమని వృథాపలుచుట దగదుసుమా? నాథా! శ్రీరామమూర్తిపై నొట్టుఁ బెట్టుకొని ప్రమాణమొనర్చితివి. జ్ఞప్తియున్నదా?

దశ—(తనలో) ఇంత గుచ్చిగుచ్చి యడుగుచున్న దెట్టికోరికెలఁ గోరునోగదా? ఏమైనను సరియే. గడచినదాని కేమి సేయఁగలను? విధికృత మెట్లున్నదో అట్లే కాఁగలదు. (ప్ర) ప్రేయసీ! జ్ఞప్తియున్నది.

కైక—నాథా!

గీ. వరుసఁ బదునాలుగేడులు ♦ వనములందు
వాసమొనరింపఁగా రామ ♦ భద్రుఁబంపి
భరతునకుఁ బట్టముఁగట్ట ♦ వలయునివియె
కోరుకొంటిని వేగంబఁ ♦ గూర్పుమయ్య.

దశ—ఆఁ ఆఁ సుందరీ! ఏమంటివి? ఏమంటివి?

కైక—వినఁబడలేదా? పట్టాభిషేక ప్రయత్నంబులు భరతున కుప యోగపరచి శ్రీరామచంద్రుని పదునాలుగేడు లరణ్యంబులకుఁ బంపుమంటిని.

దశ—హా! కైకా! రాముని! వనవాసమునకా? బంపుమంటివి? హరిహరీ! ఎంతదారుణవార్త వినఁగల్గితిని. హా! రామా! సకలసద్గుణ పరంధామా?

మ. కలనేఁ గంటినో? లేక నిక్కువముగాఁ ♦ గైకేయి యిట్లాఁడెనో?
గలుషాత్మండనునై జరించితినో య♦ జ్ఞానాబ్ధిలో మున్గి యూ
కులపాటందుచు నేభ్రమించితినో; యీ ♦ ఘోరంపువాక్యంబులె
ట్టుల నావీనులసోకెనోఁ దెలియుటె ♦ ట్లో తోఁచదయ్యెంగదా.

దేవీ! చిత్తవిభ్రమము నొంది యిట్లాడితివా? లేక నిజముగనే బలుకుచుంటివా? నీవేమి? రామునేమి? యిట్టిఘోర శిక్ష పాల్జేయుటేమి?

ఉ. నీకరుణాకటాక్షమున ♦ నేజరియించెడు రామచంద్రు, లో
కైకనుత ప్రతిష్ఠుని, ని ♦ గర్వశిరోమణినిన్, వివేకు, నన్
జీకునముంచి కానను వ ♦ సింపఁగఁ బొమ్మన నెట్టులాఁడెదో
కేకయరాజపుత్రి! పరి ♦ కింపుము వానిని నీదుసత్కృపన్.

కైక — మీరు కలఁగనలేదు. కోరుకొనిన వరంబుల నొసంగెదనని మీవలనఁ బ్రమాణములఁ గైకొని మీకడ దాచుకొనిన వర ద్వయంబులఁ గోరుకొనఁగా మీకీ విచారమేటికి ? మీరేమి యజ్ఞానులా ? అసత్యాలాపకులా ? కన్నులకు గంతలుగట్టితి మా ? మెడలు విరచితిమా ? మీరు కోరుకొమ్మంటిరి. నేను గోరుకొంటిని. భానుకులప్రదీపకులని పేర్గాంచినందులకుఁ దోడు మీసత్యదీక్షుం గాపాడుకొనఁ దలంచితిరా నాకోర్కెలనెర వేర్పుఁడు. లేదా నేనీయలేదనుఁడు.

దశ — నేను వరములవిషయమబద్ధమాడుటలేదే ?

గీ. సత్యనిరతుని, శ్రీరాము ♦ చంద్రుఘోర
విపినములకంపుమనియెడు ♦ విషపుకోర్కె
ములుకులుంబోలెనాదు వీ ♦ నులకుదోపఁ
గూడదంటిని నీకిట్టి ♦ ఘోరవాంఛ.

కైకేయీ ! సత్యగుణసంపన్నుని, సుగుణములరాసిని, ముద్దుకొమరుని, శ్రీరామమూర్తిని, అయ్యో పదునాలుగేడు లా ? విడిచి నేను బ్రతుకఁగలుగుట ?

గీ. గడియ గన్పడకున్నచోఁ ♦ గండ్లుపోయి
నట్టువిలపించు నాప్రాణ ♦ మెట్టులోర్చు ?
మురిపెములఁగొల్పువాఁడు నా ♦ ముద్దుసుతుఁడు
రామచంద్రుఁడు కాంతార ♦ సీమనుండ.

ప్రియసీ ! నీయిష్టానుసారంబుగనే పట్టాభిషేకమహోత్స వము భరతునికేగట్టెదను. కాన రెండవకోర్కె మరియొండే దైనఁగోరుము. రామమూర్తిని విడనాడి యుండుట మాత్రము కల్ల ? నేబ్రతుకఁజాల.

గీ. భీకరారణ్యములకుఁ బం ♦ పించి సుతుని
గందమూలాదులనుదిని ♦ కటిక నేలఁ
బవ్వళించుచుఁ బడరాని ♦ పాట్లఁబడుచు
నుండఁజూచుచుఁ బ్రాణమె ♦ ట్లుండు నబల

కైక—నీవు కోరెడుకోరికలు నాకుసమ్మతమైనచో నిచ్చెదనని తొలుతనే వచియించినచో బాగుగానుండెడిదిగదా ? అట్లేలనుడువవైతివి ? నానోటినుండి పలుకులన్నియు వెలువడిన పిమ్మట వాటినిఁగూర్చి నీకీపరితాపమేల? చేయఁదలచుకొన్నచో నేను గోరినరీతిని జేయుము. లేకున్నచో నీకీబాధయంతయు నెందులకు? ఒక్కసారిగా నీవుకోరనూ లేదు నేనీయనూ లేదనరాదా. అంతమాత్రమున నోటిముత్యములు రాలిపోవునా ?

దశ—హా ! రామచంద్రా ! ఎంతహీనుఁడ నైపోతిని.

గీ. రవికులంబునకెల్ల దు ♦ రంతమైన
మచ్చఁ గల్పించఁ బుట్టి యీ ♦ మాయలాడి
వ్యూహమునఁజిక్కి నీమీద ♦ నొట్టుఁబెట్టి
కొని ప్రమాణముఁజేసితిఁ ♦ గొంకు లేక.

తండ్రీ ! ఇంతటి మదాంధకారమానాకు ? ముందువెనుకల నరయకఁ గోరినరీతి నీయభీష్టములీడేర్ప సంసిద్ధుఁడనని వాగ్దానమొనర్చిన యీపరమపాతకుని నీబాణపరంపరచే సంహారింపవేమిరా ? నాయనా !

గీ. తాటకనుసంహరించిన ♦ ధనువు పరశు
రామునోడించినట్టి శ ♦ రంబు నాదు
శిరము వ్రక్కలుచేయఁగాఁ ♦ జీవలేక
మూలపడియుండెనే రామ ♦ మూర్తి ! యిపుడు.

ఓకేకయ రాజపుత్రీ! నీకింతటి కాఠిన్యత తగదుసుమా?

చ. భరతునికంటె నెక్కుడుగ ♦ భక్తినినిన్ భజియించువాని, శాం
తరసముఁ జిల్కువాని గుణ ♦ ధాముని, రాముని నాదుచేతిక
క్కఱకయినట్టి వాని నడు ♦ కానవసింపగఁ బొమ్మటంచు నె
క్కఱని వచింపజాలుదును ♦ కారుణకత్వమొకింత లేకనున్.

వనంబులకుఁబర్వాసమంపఁ దగినంతదోసములే రాముఁడు నీయెడఁజేసియున్నయెడల,

గీ. కాఱులోఁబెట్టుమంచునన్ ♦ గోరరాదె?
వేఱుగానుంచమని నన్ను ♦ వేడరాదె?
కనులతోనేనిజూచుకఁ ♦ గడపుచుండు
వాఁడఁగాలంబుఁ గాంతార ♦ వాసమేల.

అదియిదియేల అట్టిదోసంబుల సైరింపుమని వయసునఁ బెద్దవాఁడనైనను రాఘవునకు మారుగా నీపాదంబులపై వ్రాలెదను క్షమింపుము. (అనిపడబోవును.)

కైక—నీకేమైనఁ బిచ్చిపట్టినదా యేమి?

దశ—నిజముగనేఁ బిచ్చిపట్టినది! లేకున్నచో?

గీ. ఇంగితజ్ఞానమొకయింత ♦ యేనిలేక
నిన్నుఁ బ్రేల్మొల్కులటకటంచు ♦ కన్నుఁగాన
కుండఁ దబ్బిబ్బులైపోయి ♦ ఘోరమైన
శాబ్ధిగావింతు నొక్కొ మా ♦ హాబ్ధిమునిఁగి.

కైకా! నీవంతటి వజ్రకాఠిన్యహృదయురాలవని తెలసికొనలేకపోతినిగదా? ఆసుగుణశీలుని రూపరేఖవిలాసంబులఁగాంచినఁ గటికవాఁడైనను గన్నీరు మున్నీరుగా విలపించునే? నీకేలవానిపై నీయకారణవైషమ్యము? నీకోరికెరీతిని రాజ్యం

బంతయు భరతునికే యిచ్చెద. పోనిమ్ము రాముఁ డాతనికడ సేవకుఁడై యుండుటకేనిఁ దగఁడా? అట్టి దశలోనుంచినను గన్నులారఁ జూచుకొందునే? (రాము నుద్దేశించి) హా! రామా! నీకెంతటి యవస్థ వచ్చినదిరా? తండ్రీ!

సీ. నీలమేఘశ్యామ! ♦ నినుబాసి పదునాలు
గేడు లెట్లుండెడి ♦ వాఁడ ధరణి
రవికులాంబుధిసోమ! ♦ భవదీయ వనవాస
మును జూచు టెట్టులఁ ♦ బొగలుచుందు
సర్వవిజితకామ! ♦ జన్మమంతయు నిట్టు
లేద్పుతోఁ గడపుట ♦ యెట్లు నేను
రణరంగభీమ! యు ♦ గ్ర క్రూరమృగముల
తోనుండ నాకెట్లు ♦ తోచుచుండు

గీ. ధరణి సర్వస్వమేలుచుఁ ♦ దల్లిదండ్రు
లైన మమ్ములఁ గడ తేర్ప ♦ నండయగుచుఁ
బుడిసెడు జలంబు విడతువటే ♦ ముదముగూడ
అంతరించెనె! నేటితో ♦ నయ్యో రామ?

అయోధ్యాధీశుండవై, అష్టైశ్వర్యములతోఁ దులఁదూగుచుఁ బ్రజాభీష్టం బీడేర్చుచు రఘుకులంబున కింతకీర్తి ప్రతిష్టలు దెచ్చెదవను కొంటిఁగాని, తండ్రీ! నడుకాననంబున, నొంటరివాఁడవై, దిక్కుమొక్కు లేక నల్లాడుచు, మమ్ముల నీరీతి దుఃఖవారాన్నిధిఁ ద్రోతువనుకొంటినా? హా! కలుషాత్మురాలు మంధర చేసిన కుట్రయాయిది? కాకున్నచో సుస్వభావురాలగు యీ కైకేయి స్వయముగ నిట్టి దురేచ్ఛఁ జెందుట వట్టికల్ల. అవును. ఇటుల జరిగి యుండవచ్చును.

గీ. రాముపట్టాభిషేక కా ♦ ర్యముల మఱ్ఱు
నగుట నీఘాయకైరాని ♦ యట్టి దోస
మొదలఁగల్పించి ప్రోత్సాహ ♦ మొసఁగి దీని
నెగడించెఁ బెద్ద మంథర ♦ గసి యనేతు.

(రామునుద్దేశించి) ఓ మహాత్మా పితృవచనపాలనాదీక్షా బద్ధకంకణా ! శ్రీరామభద్రా ?

ఉ. ఎన్నఁడెఱుంగఁ బొమ్మని వ ♦ చించుట, రవ్వని జేరఁబిల్చి నా
యన్న ! వరాలతండ్రియని ♦ యాదరణంబున ముద్దుపెట్టుకొం
చున్నను, మోదమొందెదు గ ♦ దోయి కుమార! భరింపఁజాల నా
పన్నుఁడవై వనంబుల ని ♦ వాసమొనర్చుటఁజూచి ప్రాణముల్.

లేక లేకఁ దపించి పరమేశ్వరానుగ్రహంబునఁ బడసిన కుమారుని, గాధేయుసవనదీక్షారక్షకుఁడైన కుమారుని, నిటలాక్షుచాపభంజకుఁడైన కుమారుని, పరశురామగర్వంబు సర్వంబు ఖర్వంబుగానొనర్చిన కుమారుని, కనకాంబరధరుండై, నీలమేఘశ్యాముఁడై, అఖిలలోకాభిరాముఁడై మురిపెముఁ నింపు కుమారుని, అయ్యో వనమునకా, సింహశార్దూలాది భీకరమృగంబులు నివసించు వనమునకా ? దయా దాక్షిణ్య రహితుల రగు కిరాతులునసించు వనమునకా ? వీక్షించినంతనె గుండెలు వ్రయ్యలగునట్లు భీతినిగల్పించు వనములకా ? పంపుట ? ఎంతనిర్భాగ్యుఁడను. ఎంతదుర్మార్గుఁడను. ఎంతకాఠిన్యుఁడను. ఎంత ద్రోహుఁడను. అయ్యో ! దోషరహితుని, శాంతమూర్తిని, పరమపావనుని, మోమెట్టులఁ జూతును ? ఎట్లు జూడకుందును ?

గీ. పలితములిగె నేఁడు నాకికే ♦ గతియటంచు
దేబెనై, మూర్ఖునొచు పాపి ♦ ర్ధించియింత

ముద్దుగాఁ బెంచుకొన్న రా ♦ముని, పవిత్ర
చరితుపై నొట్టుఁబెట్టిన ♦ జడుఁడఁగానె ?

అట్టివానికి సిగ్గుగులుండునా ? ♦ ధర్మాధర్మ విచక్షణము ముం డునా ? దయాంతఃకరణ ముండునా? ఓసూర్య భగవానుఁడా!

శా. నీవంశంబు సముద్ధరించుటకు నేం ♦ తేఁ గారణంబైన యా
భావాతీతుని రామచంద్రుని పయిన్ ♦ వాత్సల్యమున్ వీడి ? యా
హా ! వాసంబొనరింపఁగా వనులకే ♦ సంపంగ నున్నాఁడనో
దేవా ! రావదియేమి నన్నునుమ నీ ♦ దివ్యప్రభావంబునన్.

గీ. వేలకొలఁదిగ వత్సరా ♦ లేలి ధరణి
వందలకొలంది యెండ్లు త ♦ పంబుఁ జేసి
యింతకాలంబు బ్రతికిన ♦ యేని నాకు
చాలదే యాయువిల నర్క ♦ సార్వభౌమ.

(ప్రకాశముగా) కైకేయీ ! కైకేయీ !

కైక—ఎందులకు నన్నుఁ బిలతురు ? తొలుత నీయిచ్చవచ్చిన వరంబుల నొసంగెదనని ఆర్భాట ప్రతిజ్ఞ లొనర్పనేల ? ఇప్పుడీ చేతవాతఁగాని బొల్లిబొల్లియేడ్పు లేల? అప్రయోజకుల కార్భాటములు మెండను లోకసామ్యంబు వృధాపోవునేమో యను దిగులుచే నట్లంటిరిఁగాబోలు. చాలుఁజాలు. మీరాజవంశ సత్యవాక్పరీణత్వము, మీప్రతిజ్ఞా నిర్వహణ పాటవము, మీకడ నింతటి ప్రజ్ఞలున్నవని యెఱింగియు, మోసపోయి మీమాటల విశ్వసించి వలలోఁబడి, నానోటి వెలితి వెలువరించు కొంటిని. వరసార్థకము లేకపోగా కైకేయి పరమ ఛండాలురాలయ్యోనను దుర్గతినందుట గూడ సంభవించె. హా ! దయామయా

ఈ నిర్భాగ్యురాల నేల బ్రదుకనిచ్చితివి. ఓరాజా! అవునని యో కాదనియో వచింపక నన్నేల యాయాసపెట్టెదవు.

దశ—ఓసి! క్రూరస్వభావురాలా? ఎంత తెగువగా మాటలాడుచుంటివి? ఎంతటి ఘోరకార్యంబున కుపక్రమించుచుంటివి? ఎంత నిర్దాక్షిణ్యముగఁ బలుకుచుంటివి? నల్లరాతికన్నఁ గాఠిన్యమైన నీమానసముఁ గరగింప నాకుఁ గాదు సరిగదా నన్ను నిర్మించిన యావిరించి కేనిఁ దరంబగునే? ఓకఠినాత్మురాలా! నీవు నాపాలిట నెక్కడ దాపరించితివి? రఘువంశోద్ధారకుఁడై, ఆర్తావనదీక్షా పరతంత్రుఁడైన రాఘవుని, ఎదుటివారికి శ్రమనొసంగఁ బ్మాన్మందిరంబున నెంతయు బరితపించురాముని, మదీయాజ్ఞానిర్వహణ దక్షుఁడైన రామచంద్రుని యేగతికిఁ దెచ్చుచుంటివే? ఓసీ పాతకీ! ధర్మశాస్త్ర విరుద్ధంబని యెంచవైతివి. అయ్యో! నలుగురు నవ్వెదరని జంకవైతివి. రఘుకుల శిరోభూషణుండగు రామునిజూచి జాలిపడవైతివి. నీవు మానిసివా? ఇక్ష్వాకుకుల పయఃపారావార రాకాసుధాకరుండగు శ్రీరామభద్రుని పాలిట జనించిన శనిగ్రహంబవు. నాపాలిట భీకరమృత్యుస్వరూపిణివై, నాచేతులకు గాజులు దొడిగించి యాడించుచుంటివి. తుచ్ఛురాలా! స్త్రీహత్యా పాతకము జన్మజన్మంబులఁ గట్టి కుడుపునని యింతదనుక యోజించితిఁ గాని నిన్ను యీవఱకే యీనిశిత ఖడ్గంబునకు బలియిచ్చి యుందును. సిరిసంపదలను బాసి, సకల బంధువర్గంబును వీడి, అయోధ్యా పురవరంబును విడచి, భార్యను వదలి, మమ్ముల నీగతి విచారమగ్నులఁ గావించి, యేకాకియై, నీమూలమున భయంకర స్వరూపిణియగు దుర్గాటవిని బ్రవేశింపనున్నాఁడే

రాముఁడు. ఆఘోరారణ్యములో నిదుర పట్టునా ? భోజనము లభించునా ? ఆక్రూర మృగంబుల భీకరగర్జనంబుల కాఁగ గలఁడా ? దుష్టురాలా ! నీకు నోరెటులాడె ? నీనాలుక చీల కున్నదేమి ? సుగుణ రత్నాకరుండగు రామభద్రుని విడచిన నాప్రాణ వాయువులు నిలువ నేరవని బ్రొల్మాలుకొంటినే ? రఘుకుల తిలకుండగు రామభద్రునకు వేఱొండుశిక్ష యేదియైన విధించి అయోధ్యాపురంబును వీడకుండెడి సూత్రమును మాత్రముజూచి నాకన్నుల కానంద మొసంగుమని వినయ పూర్వకముగా వేడుకొంటినే ? అజ్ఞాన వశంబున రాఘవుండేదియైన నీయెడల నపచారంబుఁ గావించినచో వానికి మాఱుగా క్షమింప నీపాదంబులఁ బట్టుకొనెదనని వచించితినే? ఇంతకావరమా ? ఇంత కఠినతయా? నిరతంబును సాధుమృగంబులఁబట్టి వధించి తదామిష విక్రయంబువలనఁ బొట్టఁబోసికొను కసాయివాండ్రకన్న వేయిమడుంగు లధికమగు కాఠిన్యము వహించిన నీశరీర మీ చండాలియుధంబునకు మాత్రములోంగునా ? ఓకుటిలాత్మురాలా !

మ. సుగుణాత్మున్ రఘురాము భీకరవనిన్ ♦ శోషిల్లఁ గాఁబంప నే
మగునో నాగతి యంచు నెంచక మహా ♦ హంకారబుద్ధిన్ ననున్
బొగులన్ జేసిన నీశరీరమును ని ♦ ప్పన్ బెట్టి కాల్పించినన్
దగులన్బోవునె పాతకంబు నను సుం ♦ తన్ గోముఖవ్యాఘ్రమా.

ఓపయోముఖ విషకుంభమా ? రామభద్రుని వనములకంపి నన్నురాజుఁజేయుమని భరతుండు వాంఛించునా ? ఇప్పుడీ వార్త వినిన భరతుఁడు నిన్ను బ్రదుకనిచ్చునా ?

గీ. కండ కండలుగాఁ గోసి ♦ కాక, ఘూక
గృధ్రజాతికిఁ గావించి ♦ తృప్తి యువల
రాఘవుని బ్రాలుమాలి యీ ♦ రాజ్యమునకుఁ
బట్టముఁ గట్టి కోర్కె దీ ♦ ర్చఁడె గరాసి.

ఓసీ యవినీతురాలా ? భానుకుల వినాశనంబునకుఁ గారణ భూతురాలవైన నిన్ను లోకభగవానుఁడైన భానుండైనను దన సహస్రకిరణములచేఁ బట్టి పల్లార్చఁడా ? ఓసీ ! రాకాసీ ! ఎంత విషపుకోర్కె ? ఎంతవిషపుకోర్కె ? ఎంతదారుణమైన సంగతి !

సీ. తనతమ్ములన్న హృ ♦ దంతరమున నెంత
యో మోదమును జెందు ♦ చుండువాఁడు
కులగురువన్న ని ♦ చ్చలు వినయవిధేయుఁ
డై తన ధర్మంబు ♦ లరయువాఁడు
తలితండ్రులన్న సం ♦ తతము భక్తినిజూపి
యెంతయో మోదంబు ♦ నిచ్చువాఁడు
పరులకు సాహాయ్య ♦ పడుట యన్నఁబ్రమోద
చిత్తుఁడై క్షణములోఁ ♦ జేయువాఁడు
గీ. రాచకార్యాది విషయ మ ♦ ర్మములఁదన స్వ
శక్తిగ్రహియించి ప్రజలను ♦ భక్తితోడఁ
బాలన మొనర్పఁగాఁగల ♦ వాఁడు రామ
భద్రుఁడేరీతి నివియన్ని ♦ వదలువాఁడు ?

ఓసీ దుర్మతీ ! తగదు. తగదు. ఇట్టిదురేచ్ఛ వదలుము. వదలుము. వదలుము.

కైక—నాకుఁ దగదా? ఇది దురేచ్ఛయా? నాకొంగిన వరద్వయంబు ను గైకొనుట తగదా? రామచంద్రునిపై నొట్టుఁటివే! అసత్య మాడుట మా యిక్ష్వాకుకులములకుఁ దగదంటివే? అట్టి యా చారమే లేదంటివే? సూర్యచంద్రులు గతులు దప్పినను నే నబద్ధ మాడనంటివే? గడ్డముఁబుచ్చుకొని బ్రాల్మాలితివే? లాలిం చితివే? నక్కవినయంబులఁ గనబరచితివే? నీకున్నయన్ని తెలివి తేటలఁ జాటితివే? పరితపించితివే? ఇవియన్నియు మఱపా యెనా? అవును నీవు రామచంద్రు నెటుల వదలియుండఁ జాల వో యటులనే రామచంద్రునికడ నాతనయుఁడధముఁడై పరి చారకుఁడై కాలంబుఁ బుచ్చుటఁ జూడఁజాలను. చూడఁ జాల ను. కోరినరీతినిచ్చెదనని యడ్డమైన గడ్డిఁగఱచి యిప్పుడీతొంట చేతులఁజూప నీమానసం బెట్లంగీకరించినది? ప్రమాణమునకు నియమము లేదా? పాపభీతిలేదా? ధర్మము లేదా? నీయభయ ప్రదానమును సార్థక పఱచుకొనకున్న మీకులంబున కపకీర్తి కాదా? నలువురును నవ్వరా? అప్రతిష్టకాదా? స్వల్పహింశము కొఱకెంత రాద్ధాంతముఁ జేయుచుంటివి? పదునాలుగేండ్ల కాల మెంతలోముగియును ? రాముఁడేమి మఱలరాఁడా? రామునిపై నాకుమాత్రము ప్రేమములేదా? ఆతనిపైఁ గక్షయా ? సవతి ప్రేమమే నాకాతనిపై యున్నచో నీకు నాపై సపతిభార్యా ప్రేమమేయున్నదని విశ్వసింపవలసినదేగదా? అట్టి భావమున నున్నప్పుడీప్రమాణములు చేయుమని, యీమందిర ప్రవేశ మొనర్చి యీయగచాట్లుపడుమని నిన్నెవరైన బొట్టుఁగాటుకఁ బెట్టి పిలిచిరా? ఈ యక్కఱకుగాని యూక వఁచపులు నెత్తిపైఁ బెట్టుకొని, ధర్మవిరుద్ధ లోపములన్నియు నీయందుఁ బెట్టుకొని

మీఁదుమిక్కిలి నన్ను నిందాపాత్రురాలినిగా నొనర్చుట నీకుఁ దగునుగాఁబోలు. ఎంతయుపన్యాసముఁ జదివితివి? ఎంతవింతలగు సంబోధనంబులఁ బ్రయోగించితివి ? ఎంత వగర్చుచుంటివి? పోనిమ్ము. కొంతతడవాయాసముఁ దీర్చుకొనుము. పాపము! ఊరకఁ గేకలు వైచుట పురుషుల ధర్మముగాదు. నోటివెంట నాడిన వాక్యంబులసార్థ పఱచుకొనవలయును. అప్పుడు మీ గొప్పదనము.

దశ—కైకేయీ ! నామాట వినవా ? నీయభిప్రాయమును మార్చుకొనవా ? నాకులోద్ధారకుఁడగు రామభద్రుని యయోధ్యానగరంబున నుండనీయవా ?

కైక—నన్నేల నిష్ఠూరముఁ బెట్టెదరు? విన్నవారేమందురో యని జంకుఁ గొంకు లేకఁ జేసిన వాగ్దత్తమును విడువుమని యీ వెఱ్ఱివేషంబుల వేయుట మీకుఁ బాడియేనా? మీవంశపు పూర్వీకు లిట్టులనే యొనర్చిరా ? చూడుఁడు హరిశ్చంద్రుఁడు మీవంశీకుఁడే గదా !

శా. పృథ్వీరాజ్యముఁ గోలుపోతి నని యే ♦ వేళన్ విచారింపఁ డా
సాధ్వీరత్నము విప్రునింట నతి నీ ♦ చంబైన దాస్యంబులో
నధ్వాన్నంబుగ నుండెనంచుఁ దలపో ♦ యన్ బోఁడు పుత్రుండు యీ
పృథ్విన్ బాసెనటంచుఁ గుందఁడిటులన్ ♦ వేధించెనే భూవరా.

ఆతని మనోనిశ్చయము, ఆతని సత్యవాక్పరిపాలనాధురీణత్వము వర్ణింప నాదిశేషునకేని నలవియగునా ? ఆతఁడట్టి యవస్థలనన్నిఁటి ననుభవించుటకుఁ గారణమేమి ? పవిత్రంబగు సత్యమును నిల్పుటకేకదా ? తుదకదియేగదా యతని నుద్ధరించి

నది. అట్టివారి గారవ మర్యాద లంతరింపఁ జేయుట మీకు ధర్మముగాఁ దోఁచెనా ?

దశ—ఓకైకేయీ ! నీవెట్టి ధర్మపన్నములుగ్గడించినను దుర్భరవిచారమగ్నునై గృశించుచున్న నాచెవుల కెక్కవు. ఎక్కవు. రామా రామా ! రఘుకులసోమా ! నీపాలిటి నీకూరాత్మురాలెటు దాపురించినదిరా తండ్రీ !

గీ. నిండుకొల్వునఁ గూర్చుండి ♦ నిన్నుఁ బిల్వ
నంపి యిదె రాజుఁగాఁ జేతు ♦ నయ్య రేపు
నీవు, నీసతి, యుపవాస ♦ నియతినుండి
సిద్ధముగనుండు పట్టాభిషే ♦ కమునకు.

గీ. అనుచుఁ బలికిననానోటఁ ♦ దనయ! నేఁడు
పిలిచి, వనములకేగరా ♦ ప్రియకుమార
యనుచు నాజ్ఞయ నోరెటు ♦ లాఁడు నాకు
ప్రీలదే నాదు నాల్కవే ♦ చీలికలుగ.

హా కుమారా !

సీ. బ్రతిమాలుకొంటి ఘోరపు ♦ రవు వాంఛఁ గోరుట
దగదని నీపిన ♦ తల్లి నెంతో
బ్రాల్మాలుకొంటి నీ ♦ పాదముల్ మ్రొక్కెదఁ
దనయుని క్షమియింపు ♦ మనుచు నెంతో
మొరఁ బెట్టుకొంటి నిర్ ♦ జెరలోనఁ బెట్టినఁ
గనులతోఁ జూచుకొం ♦ దనుచు నెంతో
వేడుకొంటిని యూరి ♦ వెలువల నెటనైన
నునిచిన చాలు నూ ♦ యనుచు నెంతో.

గీ. భరతునికె కట్టువాఁడవే ♦ పట్టమిప్పు
డనుభవింపుము సర్వ సౌ ♦ ఖ్యములటంచు
నెంతఁ దెల్పినఁగాని దా ♦ స్వాంతమందు
దయఁదలంప దిదెంతటి ♦ దయ్యమొకో

అయ్యో ! రామా ! రామా ! రామా ! నిన్నెట్లుబాయు
దునురా తండ్రీ ! రామా ! రామా !

(మూర్ఛిల్లును.)

రాము—(ప్రవేశము.) తండ్రీ ! వచ్చితిని. ఏమది నన్నుఁ జూచినంతనే
తండ్రిగారు మూర్ఛాగతులైరి. తల్లీ ! కారణమేమమ్మా !

సీ. కంఠారవము విన్న ♦ క్షణముననే నాకె
దురువచ్చి యెంతో సం ♦ తోషగతిని
రారరాఘవయంచు ♦ నోరారఁ బిలనుచుఁ
జైకెత్తి ముద్దాడి ♦ వరసుతుండు
నాకులోద్ధారుఁడు ♦ నారతనాల్ మూట
యంచుఁబల్వూరితోడ ♦ ననుచు నెంతో
యుబ్బి తబ్బిబ్బులై ♦ యుండు నాజనకుండు
కారణమేమొకో ♦ గాని నేఁడు

గీ. రామ! శ్రీరామ! రఘురామ! ♦ రామయనుచుఁ
బిలిచి యీరీతి వచ్చిన ♦ పిదప నన్నుఁ
జూచి మూర్ఛిల్లె నిదియేమి ♦ చోద్యమమ్మ
తల్లి! చెప్పఁగదమ్మ త ♦ త్కారణంబు.

కైక—నాయనా ! రామభద్రా ! కారణంబేమని తెల్పుదును. అయి
నను సకల సద్గుణరాసివగు నీకుఁ దెలుపరాని యంశ మేమి
యును లేదుగదా. కూర్చుండుము.

రామ—తల్లీ! చెప్పుము. సావధానచిత్తుఁడనై యున్నాఁడను. తత్కా రణంబు విన నామనంబు దత్తఱపడుచున్నయది.

కైక—వినుము. తొల్లి దేవాసుర యుద్ధమునాఁడు రణరంగమున నేను మీతండ్రిగారికి సాయపడినప్పుడు నాకు రెండు వరంబులు ప్రసాదించి యున్నారు.

రాము— సరే. దానికేమి.

కైక—ఆ వరంబులాక్షణమందవుసరము లేకుంటచే సమయంబు వచ్చినప్పుడు కోరుకొందుననఁగా సరియనిరి.

రాము—అవును. అనవుసరమగు వేళల నొందులకని యావరంబుల మా తండ్రిగారికడ దాచుకొనిరి. తప్పేమి? పిమ్మట,

కైక—వాటిసమయ మిప్పుడు లభియింపఁ గోరుకొంటిని.

రాము—వరప్రదానమునకే తండ్రిగారిట్లు మూర్ఛిల్లినారా ?

కైక—నాయనా ! లేదోయి. చివరకంటు వినుము.

రాము—చిత్తము. తల్లీ ! ఆరెండువరము లెట్టివి ?

కైక—అట్లడుగుము. నిన్ను నారబట్టలతో నట్టడవులకుఁ బదునాలు గేండ్లు ప్రవాసముబంపి, భరతున కుఁబట్టముఁ గట్టుమంటిని.

రాము—దానఁ దప్పేమి ?

సీ. నిప్పులోనైన నుఱికెద ♦ నిర్విచార
ముగను విషమేని గ్రోలెద నం ♦ భోధి నేని
దూఱ సంసిద్ధునగుదు సం ♦ తోషముగను
తండ్రియే యాజ్ఞనిడనేనిఁ ♦ దల్లి! వినుము.

కైక—తండ్రీ ! బుద్ధిమంతులగు వారి లక్షణములవ్వి. నిన్నుఁబాసి యుండలేకఁ, బరితపించుచు, నిటుల మూర్ఛిల్లినారు.

రాము—అయ్యో ! తండ్రిగారి కింతటి విచారమేలనమ్మా !

మ. పదునాల్గేడు లవెంతలో(గడచు, పా ♦ పధ్వంసులౌ మౌనులన్
ముదితోత్సాహముతో డ(గొల్చుచు, సతం♦బున్ వారి యాశీస్సులం
దెద వారల్ నియమించు కార్యముల భ ♦ క్తిన్ జేతు నర్చింతు న
భ్యుదయంబందగ నారమేశు, హృదయం ♦ బున్ శుద్ధిగావించెదన్.

ఈనావిధముగా నాయరణ్యంబున సత్కాల క్షేపమొనర్చి వెంటనే వత్తును. తల్లీ ! నాయనగారిని లేపి నేను వచ్చియుంటి నని విన్నవింపుమమ్మా!

కైక—నాయనా ! రామభద్రా ! నీతండ్రిగారిప్పుడు నాయందాగ్రహ చిత్తులై యున్నారు. కాన మెల్ల(గ( జెంత(జేరి నీవే పిలువుము.

రాము—అట్లనేతల్లీ ! (చెంతకు(జేరి) తండ్రీ ! దశరథేశా !

మ. కడు గారామున( జూచుకొంటివి వనర్ ♦ గాఠిన్యమున్ బూనవై
ప్పుడు నాయాడుదన(, జూచినంతనె మదిన్ ♦ మోహంబునుం జెంది నా
కొడుకా! రమ్మని జేరదీసినను, గో ♦ ర్కుల్ దీర్తు వీ వెప్పు డి
ప్పుడు నన్ జూచి యి దేమి తండ్రి యిటులన్ ♦ మూర్చిల్లినావయ్యయో.

దశ—(పరుండియే చూచి) రామా ! రామా ! రామా ! వచ్చితివా ? వచ్చితివా ? ఈతుఘ్నుడు, ఈరఘుకుల వినాశకుడు, నీ మొగము చూడ(జాల(డు. చూడ(జాల(డు.

గీ. రాజుగా( జేతునంచు నో ♦ రారనిన్ను(
బలికి యీనాడు నిన్ను నే ♦ వనములకు( బ్ర
వాస మంపంగ( దలపెట్టి ♦ పాతకుండ
నైతి నీ మోము నెట్టుల( ♦ జూతు(దండ్రి.

హా ! రామా ! రామా (అని లేచి కౌ(గలించుకొన(
బోయి మఱల( గ్రిందపడును.)

రాము—హా! తండ్రీ! ఇదియేమి దారుణము? నాకొఱకేల యిటుల విలపింతురు? ఏల మూర్ఛాగతులగుదురు?

గీ. కానలకుఁబోయి మునిసేవఁ ♦ బూని పాప
పుంజములఁ బాఱఁద్రోలుకఁ ♦ బుణ్యగతుల
నంది రానున్న నాకయిఁ ♦ జెందనేల
జనక! దుర్భరమైన వి ♦ చారమిటుల.

(తెఱలో)

ఓయీ! నన్నాపనేల? పోనిమ్ము.

గీ. కండకావరమూని రా ♦ ఘవుని వనుల
కంపఁగోరిన యీ కుటి ♦ లాత్మురెవరో.
పట్టి వధియించి రామునిఁ ♦ బట్టభద్రుఁ
జేసి నాతండ్రి ముదమందఁ ♦ జేతునిపుడు.

రాము—(తనలో) అక్కటా! క్రోధస్వభావుఁడగు లక్ష్మణుఁడుగూడ నిప్పుడే రావలయునా? ఇప్పుడీతని నివారించుట కడుదుర్ఘటముగదా! కాబట్టి అమ్మగారికడ సెలవుఁగైకొని వేగంబపోయి యీతనిరాక నివారించెదఁగాక! (ప్రకాశముగా) తల్లీ! కేకయరాజపుత్రీ! నాకమితోపకారమొనర్చి నన్నుధన్యునిగాఁజేసిన మీ ఋణ మెట్లు తీర్చుకొందునమ్మా!

గీ. బహుళ సంతోష హేతువై ♦ బరగు రాజ్య
భారమునువీడి సుఖముగా ♦ వనములందు
దాపసుల గ్రమోలఁజేరి నా ♦ పాప పుంజ
ములను వదలించుకొనుమని ♦ బలికినారు.

కావున నోమాతా! చంద్రునకొక్క నూలపోగనునట్లు నావందనశతంబులను గైకొని యాశీర్వదించి పంపుము.

కైక—అవును. రామా! తెల్లవారకమునుపే బయలుదేరవలసిన వాడవగుట సత్వరంబుగఁ బ్రయాణసన్నాహములో నుండుట యుచితముగదా?

రాము—అమ్మా సన్నాహములో నుండుట కేమున్నది?

కైక—అట్లనకుము. అరణ్యావాస మొనర్పఁ బోవువాని కీయమూల్యవస్త్రాభరణములతోఁ బనిలేదు. కాఁబట్టి వానినెల్ల విడచి జడలధరించి నారబట్టలను గట్టుకొని పోవలయును. తెలిసినదా?

రాము—తల్లీ!

గీ. సర్వరాజ్యంబుఁ ద్యజియించి, ♦ సకలబంధు
వర్గమునువీడి, సుఖముల, ♦ బాసిఁ పితృ
వాక్య పరిపాలనార్థమై ♦ వనులనుండఁ
బోవువానికి నాకిది ♦ కావలయునె?

కావున, మీ యాజ్ఞానుసార ప్రవర్తకుఁడనై యట్లనే నారలఁ గట్టి జడలధరియించి పోవుదునమ్మా!

కైక—రామచంద్రా! ఒక్కసంగతి!

గీ. ఒంటిగాఁ గానలకుఁ బంపు ♦ చుంటినంచుఁ
దీవ్రముగనున్నవారు నీ ♦ తండ్రిగారు
భరత శత్రుఘ్ను లిటలేరు ♦ వారుదూర
దేశమున నున్నవారతి ♦ తీవ్రకోప
గతిని చెలరేగువాఁడు ల ♦ క్ష్మణుఁడుసుమ్ము.

గీ. కులగురువు, మంత్రి నావాక్య ♦ ములను వినరు
భరతుఁ బిలిపించి వెంటనే ♦ పట్టభద్రుఁ
జేయవలెనని గట్టిగాఁ ♦ జెప్పి పొమ్ము
త్వరితగతి గురులతోఁడను ♦ దండ్రితోడ.

రాము—తల్లీ ! అల్లనే. గాని,

గీ. కని, విరామము లేకఁ బ్రో ♦ చినమహాత్ము
లైన నాతండ్రిగారితో ♦ నేను జెప్ప
కయె వెడలుటెట్లు ధర్మమా ♦ కనఁడు, వినఁడు
పలుకరించినఁ గాని నా ♦ పాపమేమొ.

కైక—తినయాజ్ఞ వెంటనే నిర్వర్తింప లేదని మనమునఁ బొగలుచు నీవంకఁ జూడకున్నారు.

రాము—తల్లీ! నీమాటయే నిక్కవమైనచో నేనాయన కెట్టిబాధయు గలిగింపఁ జాలను నాకు నీయాజ్ఞయైనచోఁ దండ్రిగారి యాజ్ఞ యైనటులఁగాదా ? ఒక్కమనవి. అమ్మా !

గీ. నావియోగముచేత మ ♦ నంబునందుఁ
బొగిలి కృశియించుచును క్రమం ♦ బుగను క్షీణ
దశకుగాకుండఁ దండ్రిని ♦ దయనుజూచి
పాలసమొనర్పు మమ్మ కృ ♦ పాంబురాసి.

(అని తండ్రిగారికిఁ బ్రదక్షిణమొనర్చి పాదములకు నమస్కరించుచు)

గీ. ఆదరించితివయ్య య ♦ హర్నిశముల
నేకొరంతలు లేకుండ ♦ నే మహాత్మ !
అట్టి ఋణమందు నేసహ ♦ స్రాంశమైనఁ
దీర్చుకొనన్తైతి నని యెద ♦ దిగులుఁగాంతు.

మఱియు నోతండ్రీ !

గీ. కనులకే సంతతంబద్దు ♦ కొనెడు ముద్దు
పాదసేవను విడనాడి ♦ నీదువాంఛఁ
దీర్పఁగాఁ గానలకుఁబోదు ♦ దేవ ! నాదు
వందనంబులఁ బ్రేమతో ♦ నందుమయ్య.

తల్లీ ! ఇదే పోవుచున్నాను. (నిష్క్రమించుచున్నాఁడు.)

కైక—ప్రాణేశ్వరా ! లెండు.

దశ—(లేచి కూర్చొని) రామా! రామా! రాముఁడేడీ? రాముఁడేడీ? రఘుకుల యశఃకాముఁడేడి ? సర్వలోకాభిరాముఁడేడి ? సకల సద్గుణ పరంధాముఁడేడి ? వెడలెనా ? ఘోరాటడవులకు ? ఒంటరిగా ! అయ్యో ! చూచువారు లేకఁ, దలచువారు లేకఁ, బిలచువారు లేక, దిఁనఁ దిండి లేకఁ బండ మంచము లేక నేగతి నల్లాడునో. దైవమా ! ఎంతపని చేసితివి,

గీ. కొడుకులో, కొడుకులోయంచుఁ ♦ కుందిగుంది
నిదుర హారములనువీడి ♦ నేనొనర్చి
నట్టి తపమునకిటు భిక్షఁ ♦ బెట్టిమఱల
లాగుకొని యేడిపింతువే ♦ లా ? మహాత్మ.

దేవా ! లోకరక్షకా ! నాజన్మమంతయు నిటులనేడ్పులతో నిండిపోవలసినదేనా ?

గీ. సుతులు లేనట్టి గతికి నే ♦ డ్చితిని మొదటఁ
బిదప గాధిసుతుండు యే ♦ డ్పించె నన్ను
యిపుడు కైకేయిమూలాన ♦ నిట్టులేడ్చు
చుంటి నన్నెంతఁగాఁ ♦ జేయుచుంటివీవు ?

గీ. ఇదియె తుదిసారియేడ్పు యిం ♦ కేడ్వ లేక
నున్నవాఁడను శోషిల్ల ♦ నుండె ప్రాణ
వాయువులు, దైవమా ! రఘు ♦ వంశజలధి
సోముఁడగు రామునిఁగా బాయు ♦ చుంటచేత.

హా! రామా! రామా! (అటునిటుజూచి) ఎవఁడురా!అచట

సేవ—(ప్రవేశించి) దేవా !

దశ—ఓరీభద్రా! నన్ను జాగ్రతగఁ గౌసల్యాంతఃపురంబునకుఁ దోడ్కొనిపొమ్ము. (భటసహాయమున నిష్క్రమించును.)

కైక—నాప్రయత్నము కొనసాగినందులకు మంధరకీవార్త నెఱిఁగింపఁబోదును. (నిష్క్రమించును.)

(తెరవాలును.)





శ్రీరామచంద్ర.

# పాదుకాపట్టాభిషేకము.



## చతుర్థాంకము.

(రామలక్ష్మణులు ప్రవేశము)

లక్ష్మ—

మ. తనపుత్రుఁ నృపుఁ జేయునెంచి నినుఁ గాం ♦ తారంబులందుండఁ బం
పను వాంఛించిన వారలెవ్వరు ? ధను ♦ ష్పాండిత్యముఁ జూపి మి
మ్మున నేనిప్పుడె రాజుఁ జేసెదను స ♦ మ్మోదంబునుఁ జెంది స
న్మునిసందోహము నిఁ సెబాసనఁగ నా ♦ మోదించుమా రాఘవా.

రాము—తమ్ముఁడా ! తొందరపడకుము. దైవతుల్యులగు పెద్దలదూ
షించుట దోసంబని యెఱింగి యుండియు నిట్లాగ్రహాయత్త
చిత్తుఁడవగుట ధర్మమా ?

గీ. తల్లితరువాతఁ దల్లియుం ♦ తటి మహాత్ము
రాలు పినతల్లి యామెపైఁ ♦ గ్రౌర్యమూని

యిటుల దూషణఁజేయ ని ♦ న్నేమనందు
రనుజ ! లోకులునవ్వరే ♦ హానికాదె ?

లక్ష్మ—అగ్రజా ! ధర్మాధర్మ విచక్షణులఁ బిమ్మటఁ జూడవచ్చును గాని తొందరపడరాదని నన్నే మందలించు చుంటిరా ?

గీ, జ్యేష్ఠులగువారు రాజౌట ♦ చెల్లునుగద
అందునను దగువారలై ♦ యలరుమిమ్ము
వనములకునంపి తనపుత్రుఁ ♦ బట్టభద్రుఁ
జేయఁగోరుటఁ దొందర ♦ చేతఁగాదె ?

అది యటుండనిమ్ము,

గీ. ముందు వెనుకల నరయకఁ ♦ దొందరపడి
యిచ్చరీతిని వరముల ♦ నిచ్చినాఁడ
ననుచు జనకుఁడు తలపోయఁ ♦ డయ్యె యిట్టి
చేతలకుఁ గారణమదెందు ♦ చేతఁ జెపుమ.

తొందరచేతనేగదా! అంతటి యవినీతుఁడా? ప్రపంచజ్ఞాన మేమియు లేకుండెనా ?

గీ. ధర్మమును దప్పకుండ నీ ♦ ధాత్రి నేలె
వేలకొలఁదిగ వత్సరా ♦ లేల యిట్టి
యవకతవక ప్రమాణంబు ♦ లాచరించె
మందుఁడగుటకు నతనికి ♦ మతులు లేవె.

రాము—తమ్ముఁడా ! సుమిత్రా కుమారా ! క్రోధస్వభావుండవై పలికెడు మాటలకుఁ బ్రత్యుత్తర మొసంగఁజాలనుగాని శాంత భావంబున వినెదువేని రవంత నీతోడఁ బ్రసంగించెదను. ఎన్నఁడును నామాట కడుగుదాటనివాఁడవుగదా ? మఱియు,

గీ. పుట్టమైతిమిగద వరం ♦ బులను నామె
కొసఁగునాటికి యుండేమి ♦ దొసఁగు గలదు
అవుసరము లేకపోవుట ♦ నవ్వుడామె
దాచుకొనియెను దండ్రి యి ♦ ద్దను గదయ్య.

గీ. ఆవరంబుల నివ్వ డీ ♦ యంగఁ గోర
సత్యవాక్యంబుఁ దా విస ♦ ర్జనముఁ జేయ
లేక నొసఁగుటఁ దప్పేమి ♦ లేదుగాదె
దీనఁ గ్రోధంబదేందుకుఁ ♦ బూనెదీవు.

కాఁబట్టి నా పురాకృత పాపపరిపాక ఫలంబీరూపంబుగాఁ బరిణమించెనని యనుకొని యూరడిల్లుము.

లక్ష్మ—అన్నా! సకలసద్గుణ సంపన్నా! అట్లనుకొని యూరడిల్ల వలయునా?

గీ. సకల సౌభాగ్యయుతులు ని ♦ క్ష్వాకుకుల శి
రోమణులరైన మీరు మూ ♦ ర్ఖులు బొనర్చి
నట్టి దుండగముల కిట్లు ♦ కట్టుబడీ మ
హాటవుల కేగుటను జూచి ♦ యాఁగఁగలనె.

(కైకేయి నుద్దేసించి) ఆ మూర్ఖురాలా? ఎంత కట్టడికార్య మునకుఁ దలపెట్టితివి?

గీ. వృద్ధరాజును బలవంత ♦ పెట్టి యెల్ల
జగములను బ్రోవఁగాఁ దగు ♦ సర్వసుగుణ
ధుర్యు శ్రీరామునిటు పంపు ♦ దువె మహాట
వులకు నీకిసుమంతేని♦ బుద్ధిలేదె.

రాము—తమ్ముఁడా!

గీ. అడుగుఁదప్పి యెఱుంగ వె ♦ న్నఁడును నాదు
పల్కులకు దేమి విపరీత ♦ మల్కఁ బూని
వారి వీరిసద్దిట్లట ♦ వలన ఘోర
పాపముగదయ్య క్రోధంబు ♦ వదలుమయ్య.

లక్ష్మ—అయ్యా ! అటులైనచో మీరు వనంబులకేగుటకే నిశ్చయించిరన్నమాట.

రాము—అహా ! ముమ్మాటికిని నిశ్చయించితిని. ఏమందువా ?

గీ. తరణికోలమునఁ బొడమిన ♦ దానిఫలము
పెద్దవారిమాటలఁ జెవిఁ ♦ బెట్టి వారి
యాశయంబుల నెరవేర్చి య ♦ మితయశము
గాంచుటయెగానఁ గాన వ ♦ సించువాఁడ.

ఇది యట్లుండనిమ్ము. నాయందుఁ గల యపరిమితానురాగంబున నన్నుఁ బాయలేక మీరెల్లరిటుల సంతాప పడియెదరు గాని నాయరణ్యావాసము నాకు సుఖదాయకమే. కష్టము గాదు. ఈవిషయమున నాకు బినతల్లిగారు మహోపకారమ్ము యొనర్చి నన్ను ధన్యునిచేసినది. ఎట్లందువా !

గీ. పెద్దదాభారమును నెత్తిఁ ♦ బెట్టుకొని దు
రంత కష్టములనుజెంద ♦ రామ ! యేల
వాంఛఁ జెందెదు సుఖముగా ♦ వననివాస
మునను నేకాకినై యుండు ♦ మనుచుఁదెలిపె.

మఱియు,

గీ. తపసు లెందఱొగలరు కాం ♦ తారమందు
వారిసేవలఁ జేసుక ♦ బ్రదుకుమయ్య

పాపహరణంబు గలుగు సం ♦ ప్రాప్తమౌను
మోక్షసామ్రాజ్య మని తల్లి ♦ బోధ జేసె.

అంతియెగాక, తమ్ముఁడా మన దూరదృష్టిని యించుకఁ గాంకించినచో మఱకుఁ దెలియుట లేదా ?

గీ. ఐహికా సౌఖ్యవాంఛల ♦ యందు మఱఁగి
దైవ చింతనమే లేక ♦ దగ్ధులైన
వారి నెందఱఁజూడ మ ♦ వ్వారిపోకఁ
బోవఁగానేల సిలుగుల ♦ బొంద నేల ?

కాఁబట్టి పినతల్లిగారి యాశీర్వచనమువలన లభియించిన యీయల్ప కాలమునందు,

గీ. పరమ పాతకమైన ♦ దుర్వాంఛలను వి
సర్జన మొనర్చి దుర్జన ♦ భర్జనుఁడగు
నారమేశుని ప్రార్థించు ♦ ననవరతము
గడుపుకొనవచ్చు గద ని ♦ రాఘాటముగను.

లక్ష్మణా !

గీ. ప్రాయమంతయు భోగముల్ ♦ వలనఁగడపి
వార్ధకమువచ్చుపిదప దై ♦ వమునుదలఁచు
కాలమేలేక హీనంపు ♦ గతులపోవు
కంటె యిదిమేలుగద మోక్ష ♦ గతినిగనఁగ.

(అటునిటుఁజూచి) తమ్ముఁడా ! అటుఁజూడుము ?

గీ. నాతరుణిసీత నాప్రియా ♦ ణంబు వినుటఁ
గంటికిని మంటికిని ధారఁ ♦ గాఁగనేడ్చు
చిచటకే తెంచుచున్న ది ♦ దేమి వెరి
యామెనోదార్చు టెట్టులో ♦ యనుజ యిపుడు.

సౌమిత్రీ !

గీ. శివధనుస్సును రెండుగాఁ ♦ జేయుటాది
నేటివరకును నిముసమే ♦ నిన్ను వదలని
యట్టి యీసాధ్వినిన్ బాసి ♦ సట్టడవుల
కెటులఁబోయెదువాఁడ నే ♦ నేమిసేతు.

సీత—(ప్రవేశించి) నాథా ! నన్నిచ టేకాకినిగానొనర్చి వనులకరుగఁ దలఁచిరా !

రాము—దేవీ ! అసురయుద్ధంబునఁ బినతల్లిగారగు కేకయరాజపుత్రి మాతండ్రిగారికొనర్చిన యమూల్యసహాయమున కచ్చెరువంది యిచ్చిన రెండువరంబులప్పుడవసరములేకుండ నాయనకడ దాచికొని యిప్పుడుకోరికొని తండ్రిగారిచేననుమతిఁబడసె. అందు నేను జటావల్కలధారినై బదునాలుగేండ్లరణ్యావాస మొనర్పుట మొదటిదియు, రాజ్యాభిషేకము భరతునకొసంగుట రెండవదియునై యున్నది. అందువలనఁబితృవాక్యపరిపాలనార్థమై వనంబులకేగు నన్నుఁజూచి మీరెల్లరు సంతసించుటకుమారుగా విచారగ్రస్తులరై నాప్రయాణమునకుఁ బ్రతిబంధముగల్పించుటఁదగునా ? నీవేకాకినిగానుండనేల ? చూడుము !

గీ. అతివిచారమనస్కుల ♦ రైనయట్టి
జనకునకు నీవు సేవల ♦ సలిపి నేను
లేనలెడు. దీనభావంబు ♦ మాని నాకు
మాఱుగా వారికడనుండు ♦ మా పడంతి.

సీత—ఆ ! ఆ ! నాథా ! పతిని వీడియుండెడు సతికి గతులులేవని పలికెడు నార్యవచనంబుల రిత్తఁజేయఁదలంచితిరా ? మిమ్మునవీడి నేనెట్టికాలమేని వీడియెటులుంగుదునా ? ప్రాణేశ్వరా ! మీ రర

ణ్యంబునఁ బడరానియిక్కట్టులఁబడుచుండ నేనీభోగంబుల నను భవించుచుండఁగలనా ? యెన్నఁడు పలికియెఱుంగని విపరీతవాక్యంబుల నేడిట్టులాడుట మీకు భావ్యమా ? దేవా ! నన్నిట్లు వియోగవారాన్నిధిఁద్రోసి వనంబులకరుగ మీచిత్తమెట్టులొప్పినదో గ్రహింపఁజాలకుంటిని.

రాము—ప్రాణేశ్వరీ ! నిన్నువిడచి నేనుమాత్రముండఁగల్గుదుననుకొంటివా ? కాని,

గీ. క్రూరమృగసంకులంబగు ♦ ఘోరవనివ
సించుటన్నను మాటలా ♦ చిగురుబోడి
భయదమునుగల్గఁజేయు ని ♦ ల్వంగ లేవు
నావలుకులాలింపుమో ♦ నాతినీవు.

సీత—ప్రాణేశ్వరా ! విపినావాసమొనర్చుట దుర్లభంబని నేనెఱుంగకఁబోలేదు. మీపాదపూజలొనర్చుచు మీయండనున్నచో నాకా వనస్థలంబే మందిరంబగును. ఆక్రూరమృగసంచయమే నాతోడ నాడుకొను పక్షితతియగును. ఆకందమూలాదిఫలంబులే పంచభక్ష్యపరమాన్నంబులగును. ఆపచ్చికతలంబే హంసతూలికాతల్పంబగును. మీతోడిపాటుగాధరియించునారగుడ్డయే జిలుఁగు వలువయగును. కాన నాథా ! నాకట్టిరిత్తభీతులఁగల్పింపక నన్ను మీవెంటఁగొనిపొండు.

లక్ష్మ—అన్నయ్యా ! దాసుఁడను.

మ. పరమాసహ్యముఁగొల్పురాజ్యమున ని ♦ ల్వంజాల మీవెంట భీ
కరకాంతారములందుఁజొచ్చి మిముల౯ ♦ గాపాడుచుందు౯ భవ
ద్చరణబ్జంబులఁగొల్చుచుందును దయా ♦ దాక్షిణ్యము౯జూపి సో
దరవాత్సల్యము నిల్పుమయ్య యనఘా ♦ త్మా ! జానకీవల్లభా !

రాము—తమ్ముఁడా ! ఇది యేటికోర్కె ?

గీ. సుఖముగా భరతునిఁగొల్చు ♦ చుండి సర్వ
భోగములఁబొందఁగాలేక ♦ నీగతి వన
ములకు నేతెంచి యిడుములం ♦ బొందెదంచుఁ
గోరెదవదేటి విపరీత ♦ కోర్కె నీకు ?

మఱియు,

మ. అరిసందోహముఁ బాఱఁదోలుచు నయో ♦ ధ్యారాజ్యసంపత్తులి
ద్ధరవృద్ధిన్ గనునట్లుఁ జేసి ప్రజలన్ ♦ దైవాఱగా నేలు సో
దరుతో నీడగనుండు టొప్పగును గాంతా ♦ రంబునందుండి దు
ర్భరసంతాపముఁ గొల్చు కష్టములనున్ ♦ వాంఛింతువేలా? యిటుల్

అదియట్లుండనిమ్ము,

ఉ. నీవును నేను లేక జన ♦ నీజనకుల్ విలపింతురంచు నీ
భావమునందు లేక వన ♦ వాసమొనర్పఁగ నేలఁగోరెదో ?
ఆవిధివారు చింతను న ♦ హర్నిశముల్ గృశియించుచుండఁగాఁ
సేవలఁజేయ నెవ్వరిటఁ ♦ జేరుదురయ్య తదన్యులక్కటా.

లక్ష్మ—సకలలోకైకధనుర్ధరులగు మీరే వీరలవిడచిపోవుచునుండ నిఁక నేనా వీరలనుద్ధరించునది ? యింటికిఁ బెద్దలై సంసారమునన్ని రీతులఁ జక్కఁగాఁ బరిపాలింపఁదగిన మీరు చతుస్సముద్రముద్రితాధారుణీవలయంబును నేర్పుమీఱఁ గాపాడఁగలిగిన మీరు, లోకోద్ధారణంబుకొఱకుద్భవంబందిన మీరు, దశరథేశుని గారాబంపుపుత్రులరైన మీరలరణ్యవాసమొనర్చుటయును, నేననవరతశోకాకులచిత్తులరగు వీరలనోదార్చుటయునా ? అదియుఁగాక, మీరులేకఁ బ్రజాఘోషంబుమితిమీఱ, మీవియోగము

చే సకలబంధువర్గంబుఁ గుందుచుండ నీరోదనధ్వనులమధ్య నేనా
నిలువఁ దగినదఁ? ఆహా! రామచంద్రమూర్తి,

గీ. గాధినందనుసవన ర ♦ క్షణముఁ జేయ
నడవులకుఁబోవునాఁడు వెం ♦ బడినిరాఁగ
"లక్ష్మణా! నిన్ను సర్వకా ♦ లంబులందుఁ
బాయకుండఁగనుండెడి ♦ వాఁడ" ననవె.

మఱియు,

ఉ. తాటకిఁగూల్చునాఁడు, రిపు ♦ దర్పము సర్వమునూడ్చునాఁడు, మ
హాటవిలోఁజరించుతఱిఁ ♦ గష్టములందిననాఁడు నీకు బా
హాటముగా సహాయకుఁడ ♦ నైనపుడగ్రజ, భాగమున్ నిరా
ఘాటముగాఁగొంటి వెస ♦ గంబనిబల్కుచు యిప్పుడేమయెన్.

అంతియఁగాక,

మ. సకలంబీవెయటంచు నమ్మికొని గ ♦ ష్టంబందునన్ సౌఖ్యమం
దకలంబుగ వెంటనంటి యతిథై ♦ దర్భ్యాప్తమెల్లాడు న
న్నకటా! యీవిపరీతరాజ్యమున న ♦ న్యాయంబుగాఁవీడి పో
నిక నెట్లుండెడివాఁడ దాశరథి యిం ♦ తేనా భవత్ప్రేమముల్.

అన్నా! పెక్కుమాటలేల,

గీ. భీకరారణ్యములకు మీ ♦ వెంటనన్నుఁ
గూడఁగొనిపోవఁబ్రతికెడి ♦ వాఁడనేక
విడచి మీరిఁక ప్రాణముల్ ♦ విడచువాఁడ
నింపుగాఁజాలమిముఁవీడి ♦ నిముసమేని.

రాము—తమ్ముఁడా! తాఁగట్టినకుందేటికి మూఁడేకాళ్ళనునట్లు నీ పట్టు
వదలిపెట్టకుంటివి. వలదన్న బలవన్మరణంబునకు సిద్ధపడియుం
టివి. నీ కేమనిచెప్పఁగల్గుదును? అట్లనే మీతల్లిగారియనుమతిఁ

బడసిరమ్ము సీతాసతీ ! నీవుఁగూడ ప్రియాణ సన్నాహము లోనుండుము. లక్ష్మణా ! అదిగోచూచితివా ? మదీయవియోగంబుచేఁ బ్రళయదుఃఖార్ణవంబునఁ బడికొట్టుకొనుచున్న తండ్రిగారినోదార్చుచు నాతల్లిగారును నీతల్లిగారును యిటవచ్చుచున్నారు. వీరలనేరీతి శాంతింపఁజేతుము ?

(అంతట దశరథుఁడును, కౌసల్యా సుమిత్రలు ప్రవేశము.)

కౌస—హా తనయా ! మమ్ములనందరి నీవిధముగఁజేసి యడవుల పాలైపోదువా ! తండ్రి నీపినతల్లి యెంతచేసినదిరా ? నాయనా?

రాము—తల్లీ ! ఆయమ్మమీఁద నేల నేరంబాపాదించెదవు ? నీకుమారుని పురాకృతకర్మఫలంబనకొనుము.

కౌస—తనయా ! అట్లనకొని ధైర్యముఁజెందు టెట్లు,

మ. వరసాకేతపురంబు నేలుచు మమున్ ♦ బాలించి రక్షించి యి
ద్ధర నిక్ష్వాకుకుల బునందునఁ బ్రశ ♦ స్తంబైనకీర్తిన్ గడిం
పరిపూర్ణంబగు కారణంబగుదువన్ ♦ భావంబుతోనుండ ! ని
ష్కారణంబ గానలకేగుచుండ నెటులఁజ ♦ క్కన్ బట్టెదన్ ధైర్యమున్.
రామా ! రఘుకుల శిరోభూషణా !

గీ. పట్టభద్రుండవై ధరా ♦ భారమెల్లఁ
దీర్చిమమ్ముల నిలఁగడ ♦ తేర్చుమాకుఁ
బురిసెకుజలంబువదలి స ♦ మ్ముదిముఁగూర్తు
వంచునమ్మితి నిటులఁ ద ♦ లంచనైతి.

లక్ష్మ—తల్లీ ! అట్టియాశల నిర్మూలముచేసి పరమపవిత్రుఁడైన రాముని మహాటవులపాలుజేయుచున్న రఘుకులనాశనకరణభూతుండగుగో ! ముందువెనుకలాలోచింపక నాదుష్టకైకేయిమాయావ్యూహంబునఁబడి పిదపఁబశ్చాత్తాపడిన నేమిలా

భము? ఇట్టి సుగుణాన్వితుని, యిట్టియవస్థలముంచుచున్న యీ నిర్భాగ్యుని యూరకవదలిపెట్టుటకు నామనంబంగీకరింపకున్న యది.

దశ—నాయనా! లక్ష్మణా! నీకుఁ బుణ్యముండును.

గీ. ఎంతయత్నించినను రాదు ♦ మృత్యువేమి
కారణముగానివిలసిత ♦ ఖడ్గమూని
వేయువ్రక్కలుగానన్నుఁ ♦ జేయుమయ్య
దుఃఖమూశాంతిఁజెందుఁ గాం ♦ తుప్రయత్నంబు.

రాము—తమ్ముఁడా! నీకు మతిలేదాయేమి? నీబాహుబలనై పుణ్యము జూపవలసినది తండ్రిగారిమీఁదనేనా? అయ్యో! ఈవన్నె వానిని నిన్నేమిచేయఁగలను? నీకింతటిదుందుడుకుతనంబు తగదని యెన్నివిధంబుల మందలించినను వినకున్నాఁడవు. పవిత్రవంతమైనతరణికులంబున కెంతటి యపఖ్యాతిఁదెచ్చుచుంటివి? ఛీ! ఛీ! విన్నవారేమందురు? ఇంతవిపరీతమా! ఇంతతొందరయా?

గీ. తొందరనుజెంది తండ్రితో ♦ ముందువెనుక
లరయకవరంబులిడెనంచు ♦ నంటివీవు
దైవసముఁడగు తండ్రిని ♦ తందరపడి
తీవ్రగతిఁదూలనాఁడుట ♦ తెల్వియగునె.

లక్ష్మణా! ఒకరిని విమర్శించునపుడు మీఁదికేమివచ్చునో యను విచారమక్కఱలేదా? విమర్శనంబునకుమాత్రము నియమంబులఁబాటింపనక్కరలేదా? పదిమందికి నీతిఁగఱపఁదగివమనమేనా లోకులచేతఁ జెప్పించుకొనవలసినది? నీవు నామాటవినఁదలంచితివేని యమ్మహనీయుని శరణంబువేఁడుము.

దశ—రామా ? నీలమేఘశ్యామా ! వంశనాశనుఁడగు నన్ను వధింప నుంకించువాని నీవేలయడ్డగించితువు ? ఇందు వానిదోసమావంత యును లేదు.

గీ. చేతికక్కఱకయినట్టి ♦ శ్రీరఘుకుల
భూషణుని కానపాల్జేసి ♦ ఘోరమనుచు
యీగతినినేడ్చువాఁ డిల ♦ నింకనున్న
నేమి ? చచ్చిననేమి ? శ్రీ ♦ రామ ! రామ !!

లక్ష్మ—(తండ్రిపాదములపై వ్రాలి)

గీ. తూలనాఁడితి మిమ్ముసేఁ ♦ దొందరపడి
తండ్రి ! క్షమియింపుమయ్యనా ♦ తప్పునకి దె
కొట్టుకొంటిని జెంపల ♦ గట్టిగాను
త్వద్ద్విమలపాదములకు వం ♦ దనమొనర్తు.

దశ—లక్ష్మణా ! నిన్ను నేక్షమియింప నర్హుండనా ? వంశపవిత్రుఁడైన కొమరుని, దానవభంజకుని, దురితలతాలవిత్రుని, శ్రీరామచంద్రుని నడుకానల కంపనెంచిన యీ పాపాత్ముఁడా ? శ్రీరామ చంద్ర కరుణాపాత్రుండవగు నిన్ను క్షమింపగలుగునది ? ఎంత మాట ? నేను క్షమింపనక్కఱలేదు ? నన్ను వధియింపుము. నీనిశితఖడ్గంబున కెఱఁజేయుము. ఏమిలక్ష్మణా ! యూరకుంటివి.

గీ. అనినమాటను దప్పకో ♦ నగునెమీకు
తప్పకొనలేకఁగాదె కాం ♦ తారసీమ
కంపుచుంటిని సర్వలో ♦ కాధ్యుఁడైన
రామభద్రుని రఘుకుల ♦ సోమునిప్పుఁడు.

రాము—తండ్రీ ! నామాటవినరా ? అజ్ఞానవశంబునఁ బల్కిన వారి మాటల సరకుఁజేయక నామనవినాలింపుఁడు.

ఉ. పుట్టినయప్పుడే నలువ ♦ మోమునఁగీసెను మూఁడుగీట్లున
న్నట్టడవిన్ నివాసము నొ ♦ నర్సుమటంచును దానిదాటఁగా
నెట్టులసాధ్యమయ్యెడి ? స ♦ హింపుఁడి యీ పదునాలుగేడులీ
వెట్టులొ కంప్లుమూసుక ౘ ♦ మింపుము నీసుతుఁడన్నమాటలన్.

దేవా! అటుఁజూడుము గురువులరగు వశిష్ఠభగవానులు గూడె వచ్చుచున్నారు. ముహూర్తకాలముగూడ సమీపించుచున్నయది.

దశ—రామా ! ఈనిర్భాగ్యునకు దుఃఖోపశమనంబునకు మార్గమేది ?
హా రామా ! రామా ! (అని ఏడ్చును.)

రాము—తల్లీ ! నీవైనఁ దండ్రిగారినోదార్చుమమ్మా! మూఁడుగడియలలో ముగియు నీ యల్పకాలవియోగమునకింత విలపింప వలయునా ? నాయర్ధాంగలక్ష్మియగు సీత నావెంటనుండ నాసుఖంబునకొంఱఁతయుండదుకదా !

లక్ష్మ—(తొందరపాటుతో) తల్లీ ! అన్నగారు నాకొక వరము ప్రసాదించినారమ్మా !

కౌస—అదేమినాయనా ! నిన్నుఁ గూడ రమ్మనెనా ?

లక్ష్మ—అవునమ్మా ! అవును.

మ. తనతోఁగూడి వనాంతరంబులకురా ♦ ధర్మాత్ముఁడా రామచం
ద్రునియాజ్ఞన్గొనినాఁడ మౌనికుల సం♦దోహంబునున్గొల్చు చుం
దును భూపుత్రిని రామభద్రుని భజిం ♦ తున్ నేను ధన్యుండనై
తిని మీయాజ్ఞలఁ గూడనిచ్చి నను నం ♦ తే సంతసింతున్మదిన్.

రాము—తల్లీ ! సుమిత్రాదేవి ! కంటకావృతంబగు నాయరణ్యంబులకు రావలదని యెంతఁ జెప్పినను వినకఁ దమ్ముండు నా వెంట రా సిద్ధుఁడగు చున్నాఁడు. కాన,

గీ. వాని మొఱనాలకించి పం ♦ పంగదమ్మ
వనములకు నాదువె బడి ♦ వానికెట్టి
కొఱంత లేకుండఁ గాపాడు ♦ కొందునమ్మ
భద్రగతి వప్పగించెడి ♦ వాఁడ మఱి.

సుమి—కుమారా ! సకలమ్ము నీవమేయని నమ్మికొని చరించు నీ ముద్దుతమ్ముఁడు నీవెంట నుండుటకు మాయాజ్ఞఁ గూడఁ గావలయునా ? సకలలోక పరిపాలకుఁడవగు నీవు వానికి రక్షకుఁడవైయుండ మాకేమి భయము. నాయనా ! నీ యిచ్ఛనీతని వానిని సుఖముగా నీ వెంటఁగొని పోవచ్చును.

కౌస—నాయనా ! సౌమిత్రీ ! నీవుఁ గూడ సీతారాముల వెంట వెడలెదవా ? తండ్రీ ! ఎంతధన్యుఁడవోయి.

దశ—రామా ! రామా ! వెడలుచుంటివా ?

గీ. కాననమునుండి మఱల రాఁ ♦ గలుగుదాక
నిలుతునే జీవములతోడ ♦ నేను భువిని
యిదియె కడసారి చూపయ్యె ♦ నే ? కుమార !
యెంతదురవస్థ గలిగె నే ♦ నేమిసేతు.

తండ్రీ ! రామచంద్రమూర్తీ !

గీ. మారకము ప్రాప్తమయ్యెనట ♦ కారణమున
గాదె తొందరచే రాజు ♦ గా నొనర్ప
దలఁచినాఁడను మదిని యుం ♦ దాక నిలచు.
ధైర్యమేయున్న యిదియిట్లు ♦ తారసిలునే ?

రాము—నాన్నగారు ! నాయందలి వాత్సల్యముచేత నట్లు రాజుఁగాఁ జేయఁదలఁచితిరి గాని వేఱొండుగాదు. దుఃఖభారమునఁ గలిగిన కష్టమే ? మీనోటివెంట నిట్టి భయత్కారణ వాక్యంబుల నాలింపుచున్నది. అట్టి యధైర్య మేలకలుగవలయును ? మీకీ విచారమేటికి ?

మ. అటనున్నారు మునీంద్రులెందఱో రమే ♦ శారాధ్యులై వారితో నట పీవాసమొనర్తునేని సుఖమే ♦ గాఁగాని కష్టంబుగా నెటుఁ దోఁచంగలదయ్య యోజనక ! మీ ♦ కేలావిచారంబునా కట సేవల్ సలుపంగ సోదరుఁడు లే ♦ డా ? సీత లేకుండునా ?

గీ. వనితలంబునఁ బదునాల్గు ♦ వత్సరములు
కష్టసుఖముల వారిలో ♦ గడుపుకొనుచు
మూఁడుకృణములలోవచ్చు ♦ వాఁడగానఁ
ద్వరితగతినాజ్ఞ నీయుఁడు ! ♦ తండ్రి ! నాకు.

దశ—తండ్రి ! నీవెంతఁ జెల్పినను నాకు ధైర్యమాగకున్నది గదా !

గీ. పాట్లనెన్నిఁటినోబడి ♦ బడసినాఁడ
నిన్ను నన్నింటిలోఁగల్పి ♦ నీళ్లువదలు
వాఁడవను నాశతోనున్న ♦ వాఁడనట్టి
యాశలడుగంటె దైవోప ♦ హితుఁడనగుట.

దశ—(ప్రవేశించి) రామా! ప్రయాణముహూర్తము మించిపోవుట లేదా ?

రాము—దేవా ! వందనంబులు !

· గీ. మోహవశమున దుఃఖాబ్ధి ♦ మునిఁగివీరు
వదలకుండిరి నన్ను నో ♦ భవ్యచరిత

ధైర్యమునుజెప్పి వీరి శాం ♦ తపఱచి నను
బంపుమార్గంబుఁ జూడంగ ♦ వలయుఁద్వరగ.

దశ—నాయనా ! రామచంద్రమూర్తీ ! ఇంక నేంట్లు జీవించనుగదా! నీవిటు వెడలినతక్షణంబు గుండెలుపగిలి చావవలసినవాఁడనే ! తండ్రీ ! ఆచచ్చుట నీకన్నులయెదుట నేజరిగినచో మనవుభయులముఁగూడ ధన్యాత్ములమగుదుము.

గీ. కుడుచువేళను నేఁబండు ♦ కొనెడివేళఁ
దలఁపునకువచ్చి రాఘవా ! ♦ తండ్రి ! నన్ను
వీడిపోతివెయన గుండె ♦ వ్రీలి ప్రాణ
ములను వీడనె శ్రీరామ ♦ మూర్తి ! యింక.

ఈ నాలుగుఘడియల కాలము నీతోఁగూడ నుండి కాలంబుఁ గడుపుకొననిమ్ము. నాయనా ! నాముద్దుఁ జెల్లింపుము. తండ్రీ ! నాకేమో పిచ్చియెత్తుచున్నది ! పైనఁజూడుము. మన వంశమునకు మూలపురుషుఁడైన భానుండు !

గీ. తనకుల వినాశమునకిట్టి ♦ త్రొట్టకుండా
కందు జన్మంబుఁజెంది లో ♦ కమునకెంతొ
యపయశముఁ దెచ్చెనంచు దుః ♦ ఖాబ్ధిమునిఁగి
పోవుచున్నాఁడు పడమటి ♦ మూలకదిగో.

దానికిఁ దదనుకూలముగా వంశ శిరోభూషణుండవై యేమో యొనర్తువని నీపైగంపెడంతాశఁ జెట్టుకొనఁగా నయ్యో ! నాయనా ! యిదియా వరుస ?

వశి—రాజా ! ఊరడిల్లుఁడు. లేనిపోని కోరికెలఁ గోరుకొనుచు దుఃఖాకుల చిత్తుఁడవై భానుకులంబున కపకీర్తిఁ దేకుము. ఈ యస్వస్థతగా నున్నసమయమున నీవా వనములకరుగుట !

చాలుఁ జాలు. రాముఁడీ వనవాసకాలము నెంత సంతసఁబుగా గడుపునో చూడుఁడు. ధైర్యమునుబూని వానిని వెంటనే బోనీయుఁడు.

దశ—దేవా ! నేనా ! నేనా ! కల్ల. కల్ల. నావలనఁగాదు.

రాము—జనకా ! నామనవి నొక్కింత నాలింపుఁడు,

గీ. మీరు దుఃఖాబ్ధిమున్గి యు ♦ న్నారటంచు
జాలిలోఁగొని వనికిఁ బోఁ ♦ జాలకున్నఁ
గలుగు పాపంబులకును నిం ♦ దలకు సీమ
గంబు నెత్తుకఁ దిరుగగాఁ ♦ గలుగు నింక.

గీ. భువినిఁ బాపాత్ముఁ డొక్కండు ♦ బుట్టి పితృ
వాక్యపాలనమును దగ్ధ ♦ పరచి భాను
వంశమునకొక్క మచ్చఁ గ ♦ ల్పనమొనర్చె
నంచు దూషణసేయరే ? ♦ యార్యులెల్ల.

అదిగాక,

గీ. ఇపుడుబోకున్నఁ బినతల్లి ♦ కెంతయేని
కోపమును వృద్ధిఁజేసిన ♦ కుటిలునగుదుఁ
గాన నామాటవిని ధైర్య ♦ మూని నాదు
వందనంబులఁ గొనివేగఁ ♦ బంపుఁడయ్య.

దశ—తండ్రి ! పినతల్లిగాదు. నీకు శనిగ్రహము. నాకుమహామారి. శనిగ్రహమైనను నేడేండ్లకు వదలును. ఇది పదునాలుగేండ్ల శనిగ్రహమురా ! నాయనా !

రాము—అయమ్మను దూరకుఁడు. తండ్రీ! ఓవసిష్ఠమహర్షిచంద్రమా! అరణ్య ప్రయాణోచితములగు వస్త్రంబులఁ దెప్పింపుము.

కైక—(ప్రవేసించి) సిద్ధముగనేయున్నవి. ఇవిగో ?

లక్ష్మ—ఆః. పాపాత్మురాలా? ఎంతపనిఁ జేసితివి? సిద్ధపరచితివా? నీగొంతునకా గుడ్డలతో నుఱిఁబోసికొని ఛావరాదా? ఇప్పటి వఱకొనర్చిన యీఘనకార్యము చాలకఁ దగుదునని నారవస్త్రములఁగూడ దెచ్చితివిగా!

గీ. రాఘవునియాజ్ఞ లేకుంటఁ ♦ బ్రాణములను
దీయనైతిని లేకున్నఁ ♦ దీవ్ర ఖడ్గ
ధారనిన్ గూల్చకుందునే? ♦ క్రూరురాల!
యొక్కమాలను జచ్చి న ♦ ట్లుండరాదె!

రాము—ఏటికీమార్గము. తమ్ముఁడా! సౌమిత్రీ!

గీ. పెద్దలను దూషణముఁజేయ ♦ వద్దటంచుఁ
బెక్కుసారులు నిన్నుఁ గో ♦ పింప వినక
నేలగత్తిని దూఁసి యీ ♦ లీలవీరి
వారిమీఁదకి నెగురఁగాఁ ♦ బాల్పడెదవు.

గీ. ఇట్టివాఁడవు నావెంట ♦ నేగుఁదెంచి
యమ్మహారణ్యమందు నా ♦ క ప్రవిష్టఁ
దేక నెట్లుండఁగలవు? యి ♦ చేవిధాన
నున్న నిన్నెట్లు నేనావు ♦ చుందు సతము.

గీ. తపసులుండెడి యమ్మహా ♦ స్థలమునందు
యోర్పదెంతగఁ జూపించు ♦ చుండవలయు
నిచట నాపినఁగాని నే ♦ నచట నాపఁ
గలుగలేకున్నఁ గలిగెడి ♦ ఫలమెఱుఁగవె?

లక్ష్మ—అగ్రజా! చెంపల వాయించుకొంటిని. క్షమింపుము.

సుమం—(ప్రవేశించి) దేవా! రథము సిద్ధపరచి తెచ్చితిని.

రాము—గురువర్యా! తండ్రీ! తల్లులారా! నాప్రయాణమునకు రథముఁ గూడ గొనితేఁబడినది. కాన నారగుడ్డఁ గట్టుకొని వచ్చెదము. తమ్ముఁడా రమ్ము. జానకీ! యీవస్త్రంబును ధరించుక రమ్ము. (అని బట్టనిచ్చును.)

సీత—(పుచ్చుకొని) చిత్తము. (అని నిష్క్రమించును.)

(రామ లక్ష్మణులును నిష్క్రమింతురు.)

దశ—మునివరేణ్యా! శ్రీరామమూర్తి యెట్టుల తేజరిల్లుచున్నాఁడో చూడుఁడు!

గీ. జడల ధరియించి, తపసి వే ♦ షమును బూని
నారగుడ్డను గట్టుక ♦ నా సుతుండు
గానవచ్చెడి యిపుడె సా ♦ క్షాత్కరించి
నట్టి ఈశ్వరుఁ బోలుచు ♦ నడుగొ దేవ.

(మఱల రామలక్ష్మణులును సీతయును ప్రవేశము.)

రాము—గురువర్యా!

గీ. మంచిచెడ్డల గఱపి స ♦ మంచితముగ
నెల్లవిద్యలఁ బండితు ♦ వే యటంచు
సద్యశముఁ గూర్చినట్టి మీ ♦ చరణములకు
భక్తి నేనిదె ప్రణమిల్లు ♦ వాఁడనయ్య.

జనకా!

మ. తపముల్ పెక్కులొనర్చినన్ గని దయా ♦ దాక్షిణ్యమున్ జూపి నా
యుపచారంబులఁ బ్రోచితీవెటులొ యు ♦ ట్లాయమ్మలైఁగూడ స
త్కృపఁజూపింపఁగదయ్య యెట్టులనొ యీ ♦ యేండ్లన్నియున్ గడ్పి రా
జ్యపుధర్మంబులనేర్పి తమ్మునకు, నై ♦ ర్యస్ఫూర్తితో నుండుమా.

మఱియు,

గీ. చిత్త సంక్షోభమంది కృ ♦ శింపకయ్య
వనములకుఁ బోతినంచుఁ దిం ♦ డిని త్యజించి
నిదుర మానకుమయ్య తం ♦ డ్రీ! యిదే మ
దీయ విన్నపమిది వృథ ♦ సేయకయ్య.

గీ. ననుఁగననటకయి మీారలం ♦ దిన శ్రమంబు
నందున శతాంశమును దీర్చ ♦ నైతిఁదండ్రి
యందుకు ఫలంబుగా నిదె ♦ వందనంబు
లర్పణ మొనర్చుచుంటి ద ♦ యన్ గనుండు.

(తల్లి దిక్కునకు)

గీ. అమ్మ! చింతను వీడఁగ ♦ దమ్మ ! పిన్న
యమ్మవయిఁ గోపమును జూప ♦ కమ్మ ! పుత్రు
పాపపరిపాక ఫలమని ♦ భావమందుఁ
దలఁచుకను ధైర్యమును బొంద ♦ వలయునమ్మ.

తల్లీ ! సుమిత్రాదేవీ !

గీ. ప్రాలుమాలితి వనికి రా ♦ వలదటంచుఁ
జిన్న తమ్ముని వినక వ ♦ చ్చెడిని గాన
వాని నొకయెత్తుగా నాదు ♦ ప్రాణమొక్క
యెత్తుగా భారమునునే వ ♦ హింతు నమ్మ.

అమ్మా ! కేకయ రాజపుత్రీ ! నాయనుంగు సోదరుం
డగు భరతుండు ప్రస్తుత మిట లేడుగాన వానితో నా వాక్య
ములుగా నిట్లని జెప్ప వేఁడెదను.

సీఉ. తమ్ముఁడ! రాజ్యభారము ము ♦ దంబునఁదాల్చుకఁ తండ్రిగారి
మమ్ములఁగాంచుచుండి నయ ♦ మార్గమునన్ బ్రజలన్ సతంబు సా

ఖ్యమ్ముగ నుండఁజూచుచు సు ♦ ఖంబుగ నేలగఁదయ్యధాత్రి న్యా
యమ్మగు పద్ధతుల్ వదల ♦ కయ్యె దురంతము లెన్నివచ్చినన్.

మఱియు,

మ. విపరీతంబుగఁ బన్నువేయుటలు, కా ♦ పీనంబు లోఁగొంచు ధ
ర్మపు కార్యంబులఁ జేయకుండుటలు, క్షు♦ ద్రప్రక్రియన్ జూపి పా
పపుపోకన్ బడిపోవుటల్ మనకు భా ♦ వ్యంబెంతయున్గాదు వం
శపు మర్యాదలు పాటఁబుచ్చకను రా ♦ జ్యంబేలుమా పూజ్యవై.

ఇఁకవిస్తరించి చెప్పనక్కఱలేదు నీతివిశారదుండవు గానఁ
గనుమెలఁగి ప్రవర్తించి యిక్ష్వాకు కులంబునకు వన్నెఁదెమ్మని
వచింపుము. తల్లీ! ఇఁక నీకుఁ జెప్పఁదగిన దేవున్నది.

మ. ఒకవేళన్ జనకుండు నీపయిని గో ♦ ధోద్రేకుఁడైయుండినన్
సకలంబీవెయొఱంగియుండుట మన ♦ స్తాపంబుఁ బోనాడి వా
నికిసేవల్బొనరించి యెట్లయినఁ దం ♦ డ్రిన్బ్రోవుమా! యమ్మ! నే
నిఁకఁబోదున్ సెలవిమ్మ! సత్కృపనదెం♦ తేఁదాల్చుచున్ సెమ్మదిన్.

కైక—నాయనా! రామచంద్రమూర్తీ! నాపై యాగ్రహమూన
కుము. పోయిరమ్ము. ఓర్వలేమిచే నీపినతల్లి యిట్లొనర్చెనని
దూషింపకుము. జానకీ లక్ష్మణులారా! మీకెల్లరకు శుభం
బగుఁగాక.

లక్ష్మ—గురువరా! తండ్రీ! తల్లులారా! నమస్కృతులు. నాకుసెల
వొసంగుఁడు.

సీత—అత్తలారా! వందనంబులు. పోయివచ్చెదను.

కౌస—సీతమ్మతల్లీ! ఎంతధన్యాత్మురాలవమ్మా! నీకు జయంబగును
గాక పోయిరమ్ము.

రాము—సీతాలక్ష్మణులారా! మన మాలసించిన కొలఁదియు వీరు మఱల దుఃఖాకులచిత్తులై మనకాటంకముఁ గల్గింతురు. రమ్ము.
(నిష్క్రమింతురు.)

దశ—హా! రామా! రామా! పోవుచుంటివా? భరింపఁజాల! భరింపఁజాల! నిలువఁజాల! కాళ్లు వడఁకుచున్నవి. మాట పడిపోవుచున్నది. తండ్రీ! రాఘవా! రామా!ఓరామా! ఓరామా! పలుకవా! వెనుకకుఁదిరిగి యీనిర్భాగ్యుని మొగమొక్కమాఱు విలోకింపవా? సుమంత్రా! ఓసుమంత్రా! రథమాపుము. అదిగో! రాముఁడాపవద్దనుచున్నాఁడు. నాయనా! తండ్రీ! రాఘవా! ఇదిగో పరుగుత్తుకొని వచ్చుచున్నాను. (అని పరుఁగిడఁబోయిక్రిందఁబడి) ఇఁక గంగలోనికిఁ బోవడమే. అయ్యో! రథముపీధి దాటిపోవుచున్నది. ఇఁక రాఘవుఁడు కనుపించఁడు. అదుగో రాముఁడు. కాడు. కాడు. అవును. రాముఁడే. రాముఁడే! నాకొడుకే. రఘురాముఁడే! కాడు. కాడు. ఇఁక నీనిర్భాగ్యునకట్టి భాగ్యముకూడనా? రామా! రామా! నేనింక గుండెప్రీలి చావపలసినదేనా? మునిశాపం బీరూపంబుగాఁ బరిణమించునా? రామా! జగదభిరామా! పట్టాభిరామా! భానువంశాబ్ధిసోమా! సద్గుణ పరంధామా! నిర్మలయశఃకామా! రామా! రామా! రామా! హారామా! రామా! రా—మా రా—మా రా—మా రా—మా హా—రా—మా! (అని మూర్ఛిల్లును)

వశి—అమ్మా! కౌసల్యాదేవీ! రాముఁడరణ్యములకుఁ బోయెను. విచారించిన నేమిప్రయోజనము! మహారాజు మూర్ఛాగతుఁడై నాఁడు నెమ్మదిగ వానిని మంచముపైఁ బరుండఁబెట్టుట యుక్తము.
(అని అట్లు చేయుచుండఁ దెలివి దింపనలెను.)



శ్రీరామచంద్ర.

# పాదుకాపట్టాభిషేకము.

## పంచమాంకము.

(ప్రవేశము:- కైక, భరతుఁడు.)

భర—తల్లీ! ఏమమ్మా! నేఁడిట్టులుంటివి.

కైక—నాయనా! ఏమని దెల్పుదును? మీనాయనగారు మనల నందరిని దుఃఖ సంద్రమునముంచి పోయిరి.

భర—ఏమీ! నాతండ్రిగారు మరణించిరా! హా తండ్రీ! దశరథేశా!

గీ. ముక్కు పచ్చలారని మమ్ము ♦ దిక్కులేని
వారలనుగాఁగఁజేసి ది ♦ వంబునందుఁ
జేరితివె? యెట్టిదుర్వార్త ♦ చెవులఁ బడియె
నకట యీగతి ప్రాప్తమా ♦ టరయనైతి.

జనకా! రవికులతిలకా!

గీ. వరసుతులకంచు నెన్నిమ ♦ న్వంతరములు
తపముఁ జేసితివో! తండ్రి ♦ తద్భృణంబుఁ
దీర్చుకొననీక మాకువి ♦ ధించినావె
ఘోరపాతకమునఁ బడు ♦ క్రూరశిక్ష.

తల్లీ ! నాయనగారస్వస్థతగానున్న వెంటనే నాకేందులకు వర్తమానమంపలేదమ్మా !

కైక—నాయనా ! వెంటనే వర్తమానమంపుటకు మాకు మనస్సులు మనస్సులలోఁగలవా ! తండ్రిగారు ప్రాణములవిడచువఱకు భరతుఁడేడి భరతుడేడి యని పలువరించినారురా తండ్రీ (అని యేడ్చును)

భర—ఎందులకు భరతుఁడు ! పాపిష్టి భరతుఁడు !

గీ. సమయమున కక్కఱకురాని ♦ జడుఁడఁ బుట్టి
పావనంబగు తరణి స ♦ ద్వంశమందుఁ
పెద్దమచ్చను బుట్టించి ♦ బుద్ధిలేని
వాఁడనై బ్రతికి యుంటిని ♦ పాపునగుచు.

అమ్మా—

గీ. కొడుకనై నందులకు జన ♦ కునకునిన్ని
నీళ్ళుచుక్కలు వదలినా ♦ కళ్ళనీళ్లు
దుడుచుకొనియింత సం ♦ తోషపడగనైతి
దేబెనై పోతినా తెల్వి ♦ తెల్లవాఱె.

కైక—అట్టియూశ నిరాశ కాలేదు. తండ్రీ ! నీకొఱకు నాయనగారి శవమును తైలఘటంబున భద్రపరచినారు.

భర—అమ్మా ! చనిపోయిన తండ్రిగారి నింతకాలముదాకఁ తైల ఘటమున నాకొఱకు భద్రపరచిరా? అట్లుంచవచ్చునా? ధన్యాత్ముఁడును, సుగుణైకరాసియు నగు రామచంద్రుఁ డింతకాలము త్తరక్రియ లాచరించకుండ నూరకొనియెనా? అట్లుంచుటకు ధర్మశాస్త్రంబు లంగీకరించునని గురువులవారు చెప్పిరా ?

కైక—రాముఁడిచట లేఁడుగదా! తండ్రీ !

భర—ఎక్కడకుఁ బోయెను ?

కైక—సీతాలక్ష్మణ సహితుఁడై వనముల కరిగెను.

భర—ఏమీ! వనములకరిగిరా? హా! తండ్రీ!

గీ. సుతుల నలువురిఁ బడసియు ♦ మృతి సమయము
నందు నొకఁడేని లేక యీ ♦ చందమునను
దిక్కులేకుండఁ బోయితో ♦ అక్కటా! వి
ధాత్రి వ్రాసెనే? నీఫాల ♦ తలమున నిటు.

జనకా! నీవు బ్రదికిన బ్రదుకునకుఁ జివఱకు నిన్ను జితిపైనఁ బెట్టి దహనమొనర్చుట కొక్కపుత్రుఁడైనఁ జెంత లేకపోయెనా? తండ్రీ! ఎంతటిగతి సంభవించినది? తల్లీ ! రామచంద్రుఁడు బుద్ధిపూర్వకముగఁ దానే వెడలెనా? లేకఁ దండ్రిగారంపిరా?

కైక—తండ్రిగారే పంపిరి! నాయనా!

భర—అమ్మా! వృద్ధాప్య దశయందుఁ దానస్వస్థతగానున్న కాలంబు నందు శ్రీరామచంద్రుని వనంబులకుఁబంపు నవుసర మేమి కలిగినది ?

కైక—నాయనా! చెప్పెదను కూర్చుండుము.

భర—తల్లీ! సావధానుండనై విందును.

కైక—తొల్లి దేవాసుర యుద్ధంబున నేను మీతండ్రిగారికి సహాయ మొనర్చినపుడు నాకు రెండువరంబు లనుగ్రహింప సమయము వచ్చినప్పుడు కోరుకొందునన వల్లెయని సమ్మతించె. ఆ వర ద్వయంబును యిప్పుడుకోరుకొంటిని. అందుఁ బదునాలుగేండ్లు రాముఁ డరణ్యవాస మొనర్చునట్లును, నీ మేలుఁ గోరినదాన నగుట రాజ్యంబునకు నిన్నుఁ బ్రభువునిజేయునట్లు నైయున్నది.

భర——ఆఁ. ఆఁ. ఏమంటివి? రాముఁడు, సకలసద్గుణ పరంధాముఁడు, రఘుకులాబ్ధి సోముఁడు, నిర్మలయశఃకాముఁ డరణ్యావాస మొనర్చుటయును, నేను రాజ్యంబేలుటయునా ? హరిహరీ? ఎట్టి దారుణవార్త వినుటకు జీవించితిని? ఓపాపీ ! ఎంతటి కార్యమాచరించితివే ? నవనీతతుల్యాంతః కరుణాసముద్రుఁడగు రామచంద్రునకా యెగ్గొనరించుట ? ఓదుర్మార్గురాలా ! ఈయిక్ష్వాకు కులంబునకెల్ల దురంతంబైన మచ్చఁగల్పించిన నీశరీరమింకఁ గాలిపోదేమి ? వరసౌధములయందు వాసమొనరించి, తతహంసతూలికా తల్పంబుపైఁ బవ్వళించి, సూర్యరశ్మి యెట్టిదో యెరుంగక, సకల రాజభోగంబులను భరించు సీతామహాసాధ్వి క్రూరమృగ సంకులంబగు మహారణ్యంబుల కరుగుచుండఁగా నీకన్నులెట్లోర్చినవే? తులువా! ఈసాకేతపురంబు పాడనినహాయని పలుకుచున్న యీరాజ్యంబు పరమ పాపిష్ఠుఁడవగు నానెత్తిపైఁ గట్టనెంచి ఓక్రూరస్వభావురాలా ! శాంతస్వభావుని నీలమేఘశ్యాముని-కరుణాసముద్రుని- పావనతేజుని- భానుకుల శిరోభూషణుని-యుగ్రాటవుల పాలొనర్చుటకు నీమనంబెట్టులుంగీకరించినదే ? పాతకీ ! ధర్మాధర్మ విచక్షణం బింతేనిలేక- నీతిలేక- మానాభిమానంబులకురోసి- పాపభీతింవదలి- యిట్టి దుష్కార్య మాచరించిన నిన్నుఁ జూచినఁ బంచమహా పాతకంబులు సంభవించునుగదే ? తుచ్ఛురాలా! వృద్ధాప్యదశయందుఁ దండ్రిగారినిట్టి తుచ్ఛపుకోర్కెలఁగోరి నిష్కారణంబుగా వాని ప్రాణంబులఁ గొంటివే ! పలుగాకీ ! నీనాలుక నీఖరాసినివేయి చీలికలుగాఁ జేసినను నాకీ ధరామండలంబునఁ బాతకము సంభవించునే ? అయ్యో రామభద్రా! ఆవిపినంబులకుఁ బోవుచు

నన్నుం దలంచి యెంత దురపిల్లితివో ? ఎంతదూషించితివో ? హా ! రామచంద్రమూర్తీ ! ఈపాతక కార్యం బొనర్చుటయం దు నేనుం గూడ భాగంబుఁ బంచుకొంటినని యెంతవిలపించి తివో ? మహాత్మా ! ఆభీకరారణ్య ప్రవేశమున కెంత వగచితి వో ? ఛీ ! ఛీ ! ఎంత పొరఁబడుచుంటిని ? జగదేక రక్షాద క్షుండగు శ్రీరామచంద్రుఁడా యట్లు విలపించుట ? రామ చంద్రా ! పాపపుణ్యంబులరయక - శాస్త్రనియమంబు లెఱుం గక - యుక్తాయుక్త విమర్శనములేకఁ దుష్చరాలై - హేయ భాజనంబగు నిక్కార్యంబునకుఁ గారణభూతురా లైనట్టియుఁ గన్నమాత్రంబుననే నాకుఁ దల్లియైనట్టియు నీపాపాత్మురాలి- నీకూరరస్వభావురాలిని- మదీయనిశితఖడ్గమున కెఱఁజేసి జన్మ పవిత్రతకొఱకు నీపాదసేవఁ జేయుచు నాజన్మంబుఁ గడుపుకొన వచ్చుచున్నాఁడ. ఇదె వచ్చుచున్నాఁడ. ఓగోముఖవ్యాఘ్రమా! తలగడ దిండువలెఁ బ్రక్కఁజేరి త్రాచుబామువై మహారాజు ప్రాణంబుల బలిగొని, నిరామయుని- నిరంజనుని- మునిలోక పూజితుని- పీతాంబరధరుని- ఆజానబాహుని- నిర్మలుని- స త్యనియతుని- పితృవాక్య పరిపాలనాదురంధరుని- శ్రీరామమూ ర్తిని ఘోరారణ్యముల పాల్జేసి యెంత కడిగిన ముత్తెమువలెఁ గూరుచుంటివే ? ఈపాపాన్వితంబగు పాడురాజ్యంబును, యీ యపకీర్తియుతంబగు రాజ్యంబును, నామెడకుఁదగిలించి నన్నే విధమునసైన యీశ్మశాన రాజ్యంబునకు త్రేఁడుగాఁజేసి ధన్యు నిగా నొనర్పుమని నీతో మొఱఁబెట్టుకొంటినా ? బ్రతిమాలు కొంటినా ? వేఁడుకొంటినా ? దేవురించితినా ? సతతంబును శ్రీ రామచరణారవింద భజనానందుఁడనై చరించు నాకును

రామునకు నెడఁబాటు కలుగఁజేసి కులుకుచుంటివా? ఓపదయో ముఖ విషకుంభమా! వజ్రకాఠిన్య సదృశంబగు నీశరీరమిప్పు డినుప సమ్మెటలచేఁ గొట్టించినమాత్రము లొంగునా? ఓ! భాస్కరా! నీకులంబెల్ల నాకులంబొనర్చి వంశపావనుండైన రఘురాముని వనంబులకు బ్రవాస మొనర్పఁబంపి. యింకెంత కాలమో మనఁదగిన తండ్రిగారిని ప్రాణంబుల బల్మిని బలిగాఁ గొనిన నీపాపురాలి నీప్రచండ కిరణములచే భస్మీభూతముఁ గావింపవేమి? భూదేవీ! పవిత్రవంతమగు నీయార్యావర్తము నందు ధరాభార నివారణార్థమై యవతరించిన సుగుణముల రాసిని, యార్యుని, యిట్టియిక్కట్టుల పాల్జేసిన యీమహామారిని గసిమసంగవేమి? నీకు భారంబు గాఁ దోఁచుచుండలేదా? ఓకూ్రరురాలా! నిన్నెంత దూషించినను దోషంబు లేదు. నిన్నే మియొనర్చినను నాకడుపులోని మంట చల్లారదు.

మ. కపటవ్యూహ మొకండుఁబన్ని క, నవ ♦ ఖ్యాతినిఁ మెడన్ జుట్టి, వం
శపుమర్యాదల వీటఁబుచ్చు నొకమ ♦ చ్చన్ బెట్టి యీలాటి పా
పపుకృత్యంబులఁ జేసినట్టినినుఁ దు ♦ ర్వారోగ్ర ఖడ్గాహతిఁ
గృపయింతేనియు లేకఁ గూల్చినసుయు ♦ న్నే! నాకుఁ బాపంబిలన్.

గీ. రాముఁడో, రాముఁడోయని ♦ ప్రజలుగోల
బెట్ట వారికి సంతసం ♦ బెట్టుఁ గూర్తు
వారి మోముల నెటుజూచు ♦ వాఁడనింక
నేగతిని యీసడులనే గ్ర ♦ హించువాఁడ.

సీ. నీమూలమునఁగఁదా ♦ రామచంద్రుఁడుఘోర
వనముల కేగుట ♦ ప్రాప్తమయ్యె

నీమూలమునఁగదా ♦ స్వామినాతండ్రి ది
వంబునకేగుట ♦ ప్రాప్తమయ్యె
నీమూలమునఁగదా ♦ యీమూడ్కిఁ దండ్రికి
నన్నుకునేద్చుట ♦ ప్రాప్తమయ్యె
నీమూలమునఁగదా ♦ రామరాజ్యమునేఁడు
పాడయిపోవుట ♦ ప్రాప్తమయ్యె

గీ. అకట నీమూలమునఁగదా ♦ అర్కవంశ
మప్రతిష్ఠకుఁ బాలయి ♦ యలరవలసె
నట్టి జెద్దిములకు మూల ♦ మైనయట్టి
పాపివగు నిన్నుఁగూల్చెడి ♦ వాడనిపుడె.

(అని కత్తియొరనుండి తీయును.)

(నేపథ్యమున)

కుమారా! కర్మానుభవమునకు వగవక నాయమ్మపై నేల దూకెదవు? శాంతింపుము. స్త్రీహత్యా పాతకదోషంబుఁ జెందకుము. మీయమ్మ కోర్కెరీతిని రాజ్యంబుఁ బూజ్యంబుగా నేలుకొనుము.

భర—ఓపాపురాలా! అటువినుము. కౌసల్యాదేవి వాక్యంబులను, ఆమె పలుకులు శూలములవలె నాటుచున్నవే? నీమూలమున నాకు నీవు తల్లివై జనించిన కారణంబున, నాతండ్రిపాలిఁట విషసర్పమువై దాపురించిన గతంబున. రాఘువునిపాలిఁట భయంకర స్వరూపిణివై ప్రత్యక్షమైనందున యెంతటి కఠోరవాక్యముల వినవలసి వచ్చెనే? దైవమా! నాయీ పాపమడంగుటెట్లు? నాయీ తనువు ధన్యతఁ జెందుటెట్లు? ఏమనుచున్నావు? (పైకిఁజూచుచు)

గీ. వారల ధరించుకను జటా ♦ ధారివగుచు
వనవపులకుఁ బోయి శ్రీరామ ♦ భద్రుపాద
ములకుఁ సాగిలఁబడు దేనిఁ ♦ దెలుపుఁ డవ్వి
ధానమని జెప్పచున్నా వె? ♦ ధర్మమూర్తి.

సర్వలోకాధారా! పాహిమాం, పాహిమాం. అట్లనే యా చరించెదను. ఓ క్రూర స్వభావురాలా! నాకీరాజ్యంబుతో నేమియుఁ బనిలేదు. కావున,

ఉ. ఈధనధాన్య సంపదల ♦ నెల్లయుమూటను గట్టుకొంచు దు
రోభ్ధధ పరాయణత్వమున ♦ బ్రుంగెదు నీశిరమందుఁదాల్చి యే
సాధనచేతనైనఁ బడి ♦ చావుము సంద్రములోన దూకుమీ
బాధలు నాకునేలఁగుల ♦ పాంసిని! నీగతిఁ జూచుకొమ్మికన్.

గీ. రాఘవుఁడులేని భూమి ధ ♦ ర్మంబులేని
ధరణి, పాపాన్వితంబగు ♦ ధర శ్మశాన
మునకు సమముగ నుంటనే ♦ మనగఁజాల
నిందుఁగావునఁ గానల ♦ యందు నిలుతు.

నేనింక నీమొగంబుఁ జూడఁజాల! అవలకుంబొమ్ము. నీవు నాకుఁ దల్లివిగావు. నేను నీకుఁ బుత్రుఁడను గాను. పొమ్ము. పొమ్ము.

గీ. తల్లి కౌసల్య నన్ను శాం ♦ తంబుఁ బూను
దోయి తనయా యనుటనిను ♦ నొంచనైతి
లేకయుండిన నీవలె ♦ కీ కృపాణ
మునకు నిన్నాఁటఁజేయునే ♦ మూర్ఖురాల.

కైక—కుమారా!

భర—ఛీ! ఛీ! ఇంకను గుమారాయని యేమేమో జెప్పఁబోవుచున్నావు. చాలు. చాలు. పలువురినోటిలోఁ బడెదమను వెఱవు లేక, నీతి లేకఁ జేసిన యీఘనకార్యముల కొక్కమూలఁ జచ్చినటులఁ బడి యేడ్వలేక నింకఁ గుమారాయని పిలచుచున్నావుగా? నిర్దాక్షిణ్యురాలా? నోరు మూసికొనుము.

(అంత వశిష్ఠుఁడును, కౌసల్యా సుమిత్రలును బ్రవేశము.)

భర—గురువర్యా! వందనంబులు. తల్లీ! కౌసల్యాదేవి!

గీ. రాజుగానున్న రాము న ♦ రణ్యమునకుఁ
బంపి పావనమగు భాను ♦ వంశమందు
మచ్చఁబెట్టిన యిమ్మహా ♦ మారి సుతుఁడ
మ్రొక్కుచున్నాఁడ నీపాద ♦ ములకు నిటుల.

కౌస—బాలకా! మీయమ్మనేల దూషించెదవు? పెద్దలశాపంబూరక పోవునా?

భర—తల్లీ! నీవెంతఁదెల్పినను నామనంబంతయు నారామచంద్రునిపై నున్నదమ్మా?

గీ. ఎప్పుడాగహన సీమకు ♦ నేగి రాము
భద్రు పాదంబులకు మ్రొక్కి ♦ వానిఁ దెచ్చి
పట్టభద్రునిఁ జేసెడి ♦ వాఁడనో య
టంచు నామది తొందర ♦ రించుచుండె.

గురువర్యా! శ్రీరామచంద్రుని యొద్దకుఁ బోవుటకిప్పుడు సమయమేనా?

వశి—భరతా! సమయాసమయ విచారణమవ్వలఁ జేసికొనవచ్చును. ముందు నీరాక కెదురుచూచుచుఁ దైలఘటంబున భద్రపరచిన

విశ్వామిత్రుడిగారి కుచితక్రియల నెరవేర్పవలసి యున్నది. ఇంక నాపుటకు వీలు లేదు.

భర—ఆర్యా ! ఇదంతయు నెరవేరిన పిమ్మటనేనా ?

గీ. సుతులు నల్వుర నేమొక్క ♦ చోటఁ గూడి
మామహారాజు కొఱకింత ♦ యఘువరించి
కర్మ సూత్రంబునకు దూరి ♦ కార్య శేష
మును బొనర్చుటలు వశిష్ఠ ♦ మునివరేణ్యా.

వశి—ఏది యెట్లుండినను ముందిచ్చట జరుగవలసిన విధివిధానంబులు తప్పవు గదా !

భర—తల్లులారా ! ఎంత చిత్రము జరిగినది ? ఎట్టినాటకము జరుగు చున్నది.

మ. వ్యసనంబింత యెరుంగకన్ సతత సౌ ♦ ఖ్యానంద వారాన్నిధిన్
మసలన్ జాలిన మిమ్ముఁ జూచుటకునై ♦ మాయమ్మ కండ్లార్పకే
దొసఁగుల్ జేసి యశంబు మంటఁగలిపెన్ ♦ దుష్టత్వ మింతొప్పునే
పసపుం గుంకుమ నేఁటితోడ విఫల ♦ త్వంబయ్యెనే మీకయో.

అమ్మలారా !

మ. భరతుండింతటి దుష్టుఁడాయని దలం ♦ పన్ బోకుడీయిట్టి దు
ర్భర సంతాపదురంత కృత్యము లోన ♦ ర్పన్ బోవునాతల్లియుం
చెఱుఁగన్ నాపయిఁ గిన్కఁబూనకుఁడి యి ♦ ట్టే వేడుచున్నాడ నా
గురుపాదంబులు సాక్షిగాఁ బలికితిన్ ♦ గోపంబులన్ వీడుడీ.

ఓ వశిష్ఠమహర్షి చంద్రమా ! ఈకట్టడికార్యంబున నా పాపం బింతయేని లేదని మీయంతరాత్మ సాక్షిగానమ్ముదరా?

వశి—అటులెవ్వరుఁ దలంపలేదు. అందులకు నేనే సాక్షిభూతుఁడను. వందు పోదము. కాల మతిక్రమించు చున్నది.

భర—తల్లులారా !

గీ. తలవని తలంపుగానిట్లు ♦ గలిగెనంచు
దైవగతికింత యేమిట్టి; నా ♦ తండ్రిగారి
మృతకళేబరమునుజూచి ♦ యింత గోడ్చి
చేయవలసిన దంతయుఁ ♦ జేతురందు.

అమ్మలారా ! ఒక్క విషయమునకు మాత్రము మిక్కిలి ఖేదపడుచున్నాను.

గీ. జ్యేష్ఠసుతుఁడయి, లోకసం ♦ సేవ్యుఁడైన
రాఘవుని జేతులార కా ♦ ర్యక్రమంబు
జరిగియుండినఁ దండ్రికి ♦ సద్గతులు ల
భించుఁగద యట్టివాంఛ న ♦ శించిపోయె.

(తెఱలో)

గీ. రాఘవుని గాననములఁ జే ♦ ఱఁగనుజేయఁ
జేసితివె బోధలను మూర్ఖ ♦ చిత్త ! మంధ
రా ! నడువు మిప్పుడట ఖడ్గ ♦ రాజమునకు
బలిగనొనరింతు భరతు కో ♦ పంబుఁదీఱ.

కౌస—భరతా ! ఎచటిదా కోలాహలము ? వినుము.

భర—తల్లీ ! ఎచ్చటిదా ? మఱలవినుము నీకే తెలియఁగలదు.

(తెఱలో)

గీ. రవికులాగ్రణియైన శ్రీ ♦ రామచంద్రు
వనములకుఁ బంపుటందుఁ గా ♦ రణముదీని
బోధయగుటను నాదగు ♦ క్రోధశాంతి
కొరకు దెచ్చుచునుంటి సం ♦ బరముతోడ
భరతుఁ జెటనున్నవాఁడో ♦ తెల్పంగ వలయు.

భర—అమ్మా! తెలిసినదా! శ్రీరాము వనవాసమునకుఁ గారణ భూతురాలైన మంథరను శిక్షించుటకై యిచటకుఁ దెచ్చుచున్నాఁడు.

కౌస—నాయనా! మన గతులిట్లుండఁగా దానిపై క్రోధమేల? కావున నామాట వినఁదలంతురేని దానిని వదలిపెట్టుమని చెప్పుము.

భర—చిత్తము.

శత్రు—(ప్రవేశించి) అగ్రజా! మనకెల్లర కేలికగ నుండఁదగిన యన్నగారిని వనంబులకుఁ బ్రవాసమంపుటకుఁ గారణభూతురాలైన యాదురాత్మురాలిని బట్టి తెచ్చితిఁ గావునఁ దగిన శిక్షల విధించి నన్ననుగ్రహింప వేఁడుచున్నాఁడ.

భర—తమ్ముఁడా? శత్రుఘ్నా! శిక్షించుటకును, రక్షించుటకును, నేనెవడను? పెత్తల్లిగారి యాజ్ఞయైనది. కానఁ గర్మసూత్రంబునకు వగచుచు నామెను విడచిపుచ్చుము.

మంథ—దేవా! అపరాధిని మన్నింపుము. బుద్ధిగడ్డితినిచేసిన నాపాపంబు క్షమింపుఁడు!

శత్రు—ఛీ! పాపాత్మురాలా! నీదినము బాగుండుటచే బ్రతికితివి. పొమ్ము.

మంథ—(నిష్క్రమించును.)

భర—గురువర్యా! తల్లులారా! కాలాతిక్రమణం బొనర్పనేల పోయి విద్యుక్త ధర్మంబుల నెరవేర్తము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---



శ్రీరామచంద్ర.

# పాదుకాపట్టాభిషేకము.



## షష్ఠాంకము.

ప్రథమరంగము—చిత్రకూటపర్వత ప్రాంతారణ్యభూమి.

(ప్రవేశము-సీతా రాములు.)

రాము—ఓ జనకరాజపుత్రీ! సింహశార్దూలాది భీకరమృగంబుల కాకరంబగు ఘోరారణ్యములయందుఁజేరి పడరాని యిడుములఁబడుచు నామూలమునఁగదా? యీసూదిరాలపైఁ బయ్యెద కొంగుఁ బరచుకొని పరుంటివి. ఓ జానకీ! శుద్ధాంత సౌధములయందు ననవరత మసంఖ్యాకులగు దాసదాసీ జనంబులు కొల్చుచుండ సర్వ సుఖోపేతవై యలరారు నీవు నామూలమున గదా! యీకంటక శిలావృతంబగు వనస్థలంబునఁ జేరి కందమూలాది ఫలంబులఁదిని కాలంబుఁగడపుట. ఓ సీతాసతీ! సతతంబును దివ్యభూషణాలంకార శోభితవై విలసిల్లు నీవు నామూలమున గదా! నారగుడ్డల ధరియించి కాంతారంబునఁ జేరి యవస్థలొందుట. దుర్భరతమంబులగు నీకష్టంబులఁ దిలకించు కొలంది నాగుండె లవియుచున్నవిగదా! సాధ్వీరత్నమా!

నీవీ నిర్భాగ్యునిఁగాక మరియొక మహారాజును జెట్టఁబట్టినచో నిట్టి దురంతకష్టములు వాటిల్లకుండెడివేమో? ఇంతీ! ఇంతింతనరాని వంతలపాలైనను స్వాంతంబున నావంతయుఁ జింత నొందని నీయంతరాత్మ నెంతని కొనియాడుదును? జనకుని కూతురవై, దశరథేశ్వరుని పెద్దకోడలవైన నీకా ఈ కష్టంబులు? వలదని యెంతవారించినను వినక యెండవానలకోర్చి ఆ మిట్టపల్లములలో నా ముండ్లత్రోవలలో శ్రమ యనుకొనక భరించి వచ్చిన నీధైర్య మేమందును?

సీత——నాథా! మీరిట్లాడఁ దగునా? చూడుఁడు.

గీ. దగ్గఱనుజేర వేనవేల్ ♦ దాసికాగ
ణంబు పరిచర్యలెన్ని యొ ♦ నర్చు చున్నఁ
గాని బతిచెంత లేని య ♦ మ్మానవతికి
గతులు గల్గునె? ఘోర పం ♦ కములుగాక.

మఱియు,

గీ. కష్టములవెన్ని గల్గినఁ ♦ గాని బతిని
మాత్ర మెన్నండుఁ బాయని ♦ మానసీయు
రాలి కిహమునఁ బరమున ♦ రాదె కీర్తి
యుభయలోక పూజితయని ♦ యో హృదీశ.

అందుచేత,

గీ. మందిరారామసీమల ♦ యందునుండ
కుందినను భూషణములు లే ♦ కున్నఁగాని
దాసికావర్గసేవలు ♦ దగ్ధమైన
రామ నీతోడిదేలోక ♦ మో! మహాత్మ.

గీ. అనుచు హృన్మందిరమునఁ గ ♦ ల్గిన ప్రమోద
మునను మీ వెంట వనితలం ♦ బునకువచ్చి
నట్టిననుఁజూచి మీరలి ♦ ట్లనఁగనగునె ?
దేవ ! మిము బాయకుంటయే ♦ గావలయును.

రాము—ప్రేయసీ ! నాయందలిఁగల యనురాగాతిశయముచే నట్లాడుచుగాని,

సీత—నాథా ! ఉండుఁడు. ఎచ్చటనో పెద్దధ్వని వినవచ్చుచున్నది. దుర్మార్గులైన దానవులు గారుగదా !

రాము—అయినవమాత్ర మేమిభయము !

గీ. లోకకళ్యాణ మొనరింప ♦ నాకుఁ బెద్ద !
లిచ్చినధనుస్సు ఖడ్గమి ♦ ల్లివిగో గనుము
యివ్వినాచేతనుండ నిం ♦ కేటిభయము ?
దిగులువీడుము నెన్నుగా ♦ [illegible]

దేవీ ! అల్లదిగో చూడుము. లక్ష్మణుఁడేటికో తొందరగాఁ బరువెత్తుకొని వచ్చుచున్నాఁడు.

(లోపలలో)

ఓరోరీ ! మహాపాతకవర్తీ ! దురాత్ముఁడా !

మ భరతా! రాజ్యముస్వల్లఁ జూరఁగొని ♦ పాపంబాచు నూహింపి న
క్రూరణిగా రాఘవుకానలంపు నిలువం ♦ గాఁ బాపుటల్ జాలక
గరుణాదూరుఁడవై రణంబుపలుపం ♦ గా వచ్చుచున్నావురా !
దురితస్వాంతుఁడ రార ! యీశరమునన్ ♦ ద్రుంతున్నిమేసంబులో.

తే. గీ. తోడఁబుట్టినవానిని ♦ దుృంచితినని
నిందఁ జేకూఱుఁగాక నో ♦ పందనిన్ను

పాపమునకింత నెఱువక ♦ ప్రక్కలించి
ముక్కలుగఁ జేతురా యుద్ధ ♦ మునకురార.

లక్ష్మ—(ప్రవేశించి)

శా. అన్నా! చూపుఁడు నిండుసైన్యములతో ♦ నానందుఁడై యాజికిన్
సన్నాహంబున వచ్చుచుండె శరముల్ ♦ సంధించి సిద్ధంబుగా
నున్నఁగాని ప్రయోజనంబుగనవే ♦ మోహాదురాత్ముండుయీ
పన్నాగంబును బన్ననేమి కతమో ♦ భవ్యాత్మకా ! రాఘవా!

(భరతు నుద్దేశించి)

ఓరీ ! పాపాత్ముఁడా ! భరతా ! ఎంతటి తుచ్ఛకార్యంబు నకుఁ బాల్పడుచుంటివిరా ? నిర్విచారుని, సర్వకాల సుఖోపే తుని, శ్రీరామమూర్తిని వనవాసంబున కంపినదిచాలక న యోధ్యా రాజ్యపాలనం బూడఁగొట్టి నెత్తిపైఁ బెట్టుకొనినది చాలకఁ, బెద్దసైన్యమును గూర్చుకొని యుద్ధంబునకుఁ గూడ వచ్చితివిరా ? నీకీదుర్బుద్ధి యేదుర్బుద్ధి బోధించెనురా ? లోకై క విఖ్యాతుఁడగు శ్రీరామమూర్తిని సంహరించి గురుహత్యా పాతకంబును గూడ మెడకుఁ గట్టుకొన యత్నించితివిరా ? దురాలంభుఁడా ! మదీయ బాహుబలాతిశయంబున నిన్నంత కాలయంబున కంపి నీతల్లిని పుత్రవిహీనురాలిని గావింపకున్న నేను రామానుఁజుండ నేనా ?

రాము—(అపవారించి) తమ్ముఁడా! ఏటికాతొందర ? నీక్రోధంబును జాలించి నావంకఁ జూడుము.

గీ. భరతుఁడేమి ? నన్నుఁ ద్రుంప ♦ వచ్చుటేమి ?
యతఁడు ధర్మవిదూరుఁడే ? ♦ మఱియొకింత

లేక నీలీల వానిపై ♦ లేనిపోని
వాదులేటికి మోపెదీ ♦ వాఁడవీవు ?

లక్ష్మ—అన్నా ! నాకు మతిలేదా ? వానిపై లేనిపోనివాదులు మోప నాకేమంత గ్రహచారంబు పట్టినది ? అటువైపునఁ దిన్నఁగాఁ జూడుఁడు,

గీ. పాపచింతనమేలేక ♦ భక్తినెల్లఁ
బోవిడచి సిలుగులంబెట్టి ♦ బుద్ధితోడ
ధనువును ధరించుకొనుచు యు ♦ ద్ధమునొనర్ప
వచ్చుచున్నాఁడు భరతుఁడో ♦ భవ్యచరిత.

రాము—లక్ష్మణా ! భక్తియుతుండగు భరతుండు నాపై నెన్నఁడట్టి ద్రోహమును దలంచువాఁడుకాఁడు. వానిరాక కేదిమో విశేషకారణముండి యుండవచ్చును. ఐనను గుడువఁబోవుచు నీకూరాకు రుచు లిప్పుడేల ?

(తెఱలో)

గీ. రాజ్య సర్వస్వమునుబాసి ♦ రమణితోడ
సోదరునితోడ వనముల ♦ సుళ్లిక్కుచున్న
రామ ! శ్రీరామ ! జానకీ ♦ రామ ! యెడ
నుంటివో ? వేగదర్శన ♦ మొసఁగరాదె ?

రాము—వింటివా ! లక్ష్మణా ! భరతుని పలుకులను, వాని నిజాభిప్రాయము నిప్పటికేని గుర్తించితివా ? నేగ్రహించినంత వఱకాతఁ డింటికివచ్చి యీ యుదంతంబంతయు నారసి, విచారపడి, యెట్టులేని నన్ను బ్రతిమాలి గొనిపోయి రాజ్యాభిషేకమొనర్ప వలయునని యాతని యాశయమైనట్టుఁగాఁ దోఁచెడిని.

లక్ష్మ—అగ్రజా ! ఆతని దీనసంబోధనంబుల వలన నట్టులనే గ్రహించితిని. అజ్ఞానవశుండనై పలికిన పలుకుల క్షమింపు(డు.

(వసిష్ఠ సహితుఁడై భరత ప్రవేశము.)

భర—దేవా ! వశిష్ఠమహర్షి చంద్రమా !

మ వరపీతాంబరధారి రాముఁడు; జగ♦ ద్వంద్యుండు; నిత్యుండు; భా
స్కరవంశాంబుధి సోముఁడార్తజన ర ♦ క్షాదక్షుఁడీరీతి దు
ర్భరసంతాప నిమగ్నుఁడౌచును జటా ♦ వల్కలంబులన్దాల్చి కా
పురమున్సల్పుచు నుండఁగాన నెటులన్ ♦ మోమెత్తుకన్జూచెదన్.

గీ. కైకమూలాన సర్వలో ♦ కైకసుతుఁడు
యిటుల బాధించుచున్న నా ♦ హీన బుద్ధి
కెంత వగచునో? ననుఁజూచు ♦ నంతనేమి
యనునో? నాకేమియును దోఁచ ♦ దయ్యో నిపుడు.

వశి—భరతా ! ఇంతదూరముదాక ధైర్యముగావచ్చిన నీకు మఱల నీవిచార మేటికి ? అరుగో సీతారామ లక్ష్మణులు. వారిని గలిసికొందము రమ్ము. (పరిక్రమింతురు.)

రాము—తమ్ముఁడా ! లక్ష్మణా ! వశిష్ఠభగవానులను వెంటఁబెట్టుకొని భరతుండదె వచ్చుచున్నాఁడు. నీవేమియుఁ దొందరపడ వలదుసుమా !

లక్ష్మ—ఆజ్ఞ.

భర—(సమీపించి కేల్మోడ్చి)

చ. పుడమిభరించి భోగములఁ ♦ బొందుచునుండుటఁ జూడలేక నీ
వడువునఁ గానలందున ని ♦ వాసమొనర్పఁగఁ బంపి; ఘోర నిం
దలకయి కొంగుపట్టి, యల ♦ తండ్రినిబాపిన పాతకుండఁ ద
మ్ముఁడ! భరతుండ! యీగతిని♦ మ్రొక్కెదునీకిదె రామభూవరా.

రామ, లక్ష్మ—(ఆతురముతో) భరతా! లెమ్ము. లెమ్ము. ఏమీ! తండ్రిగారు మరణించిరా? ఎంతదారుణము. హా తండ్రీ!

(అని మూర్ఛిల్లుదురు.)

రాము—(లేచి) తండ్రీ! పితృవత్సలా! అనుకొన్నంతయు జరిపితివా?

చ. నను నెడఁబాసితంచును మ ♦ నంబున బెగ్గిలి; తిండిమాని, ని
ద్రనుద్యజియించి మంచమున ♦ రాత్రిఁబవల్ గృసియించిపోతివా?
తనయులనొంటిఁజేసి యెటు ♦ దాపురమయ్యెను నీకుమిత్తి? యే
మనినిలువంగనేర్తు మక ♦ టా! యికనిబ్భువి ఘోరచింతతో.

హా! దైవమా!

గీ. భానుకులరత్నమును మృతి ♦ వాతఁబెట్టి
మమ్మునీగతి దుఃఖ సం ♦ ద్రమ్మునందు
ముంచి యేడ్పించ నీకేమి ♦ మంచి కలుగు
దైవమా! యింతక్రోధంబు ♦ తగునె? నీకు.

వశి—రామా! ధైర్యమవలంబింపుము. సర్వజ్ఞుఁడవగు నీవే యిట్లు విలపించినఁ దక్కినఁవారిగతి యేమి?

రాము—అయ్యా మునీంద్రా!

సీ. తేటాపఁగాఁజేయు ♦ రారాఘవా యంచు
విలపించు నప్పుడా ♦ పించనైతి
కొడుక! నీతోఁగూడ ♦ నడవుల కరుదెంచు
చున్నాఁడ ననఁగ నే ♦ నొప్పనైతి
పుడమిపైఁ బడిదిగుల్ ♦ బొందుచుండఁగ లేవ
దీయుచు సేవలఁ ♦ జేయనైతి
నాచేతిలో మర ♦ ణంబుఁ జెందెద నన్న
జనకువాంఛను దీర్పఁ ♦ జాలనైతి.

గీ. సకట నామూ౯ముస తన ♦ కంతలేసి
కష్టములు ప్రాప్తమైనను ♦ గన్నకొడుకు
నగుటఁజేతికి నాధార ♦ మయెదు ప్రాప్తి
కలుగదయ్యెను ధైర్యమె ♦ ట్లులనుగాంతు.

హా! తండ్రీ!

మ. వరసాకేతపురంబు నేలుచు భవ ♦ ద్భారంబులన్ దీర్చుచున్
సిరిసంపత్తుల వృద్ధిఁజేతునని యెం ♦ తోనాశతోనున్న నీ
వరవాంఛల్ నెరవేర్పనైతి నకటా! ♦ పాపంబిటుల్ బ్రద్దలౌ
టరయన్ జాలకపోతి బ్రహ్మలిఖితం ♦ బన్యాయమై యుండుటన్.

తమ్ముఁడా! భరతా! నీవు నిక్కముగా ధన్యుఁడవోయి!

గీ. నిక్కమగు పుత్రకుఁడవౌట ♦ నీకుఁదక్కఁ
జేతిమీఁదుగ మట్టిని ♦ జేయుఫలము
ధన్యుఁడవునీవు! మేము పు ♦ త్రకులమైనఁ
గాని శత్రులమైతిమి ♦ గాదె? భరత!

భర—అన్నా! ఆవిషయమున నల్వురము సమానులమే యైతిమి.

రాము—తమ్ముఁడా! అట్లనుచుంటివేమి?

భర—అన్నా! ఏమిచెల్పుదును?

ఆ. వె. నేను వచ్చువఱకె ♦ నేలఁబాసి మెలంగె
ధర్మమూర్తియైన ♦ తండ్రిగారు
తైల ఘటమునందుఁ ♦ జాల జాగ్రత్తగ
నేను వచ్చుదాక ♦ నిలిపినారు.

రాము—భరతా! సుతులము నల్వురముండియుఁ జివరకు దిక్కులేక చనిపోయినను వెంటనే గావలసిన కర్మనడుపక శవమునుగూడ నాపి యుంచిరా?

వశి—రామా! అచటఁ గర్తలేకుండ విద్యుక్తధర్మము లెట్లు నెఱ వేఱును.

రాము—తమ్ముఁడా! తండ్రిగారు చనిపోవునప్పు డెంతబాధ పడిరో గదా?

భర—రామచంద్రప్రభూ! ఆవిషయము లెఱింగినది మన గురువుల వారే.

రాము—మహర్షి తిలకమా! తండ్రిగారు దృశావస్థను బొందునప్పు డెట్లుండిరో?

వశి—ఆవిషయమునుగూర్చి నేనేమి దెల్పుదును గాని, ముఖ్యముగా నిది వినఁదగినది.

గీ. రాజుగానుండి నాదు భా ♦ రమును దీర్చి
భానుకులమందు నెంత యో ♦ వన్నెఁ దెచ్చి
యశము గాంచెదవను నాదు ♦ యాశలెల్ల
భగ్నముగఁ జేసితే రామ ♦ భద్ర నీవు.

గీ. అనుచుఁ బలుసారు లేడ్చుచు! ♦ హా మదీయ
రత్నమా! యొంటిఁజేసి య ♦ రణ్యములకుఁ
బోతివా! రామచంద్ర! సా ♦ కేత పురము
వదలి యంచును బ్రాణముల్ ♦ వదలినారు.

రాము—హా! దశరథేశా!

గీ. లేరు లేరని విలపించి ♦ కోరి తపముఁ
జేసి మముగని పెద్దలఁ ♦ జేసి కృపను
బ్రోచినందుకు ఫలముగా ♦ ఘోరనేడ్వఁ
జేసినాఁడను నాపేరు ♦ మాసిపోవ.

గీ. రామచంద్రా యటంచు నో ♦ రార ( బెద్ద
కేకలిడి యేడ్చునప్పుడీ ♦ వేకరణిని
బాధలందితో? చెంత నె ♦ వ్వరును లేమి
నెటుల గిలగిల లాడితో? ♦ యనఘ లేశ.

వశి—రామభద్రా! ఏటికీవిచారము? చనిపోయినవారు మరల వత్తురా?

గీ. పుట్టుట లెప్పుడుంగానో ♦ గిట్టుటలు న
పుడె గలవవి స్వభావిక ♦ ములు దలంప
జీవకోటికి వాటికై ( ♦ జింత(బొంది
చేయ(దగు కార్యమిల విమ ♦ ర్శింప లేదు.

కా(బట్టి కావలసిన కర్మనాచరింప నాకాలనుతీరంబునకు( బోదము రమ్ము.

రాము—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు.)

---

షష్ఠాంకము—ద్వితీయరంగము.

---

[రామలక్ష్మణ భరతశత్రుఘ్నులును, వశిష్ఠు(డు మున్నగువారలు ప్ర॥]

భర—అన్నా! రామచంద్రా!

మ. నినుఘోరాటవి కంపితిగా జనకు మం ♦ టిన్ గల్పితిన్ దల్లిచే
సిన మోసంబున(జిక్కి యర్కకులవా ♦ సిగా బూదిపాల్జేసితిగా
జనులందే నపవాదు( జెందితియిటగా ♦ ఛండాలునై పోయి యే
మనిజీవింతును ధాత్రినింక రఘురా ♦ మా! నామొఱాలింపుమా.

చ. కనికతంబునన్ జనని ♦ గా( దలపోసెడు నట్టికైక ప
న్నినకపటక్రియల్ దెలియ ♦ నేరకపోతిని సుంతయేని యే

మనిదలపోయుచుంటిన్హా హా ♦ దంతరసీమను నేనెఱుంగు దం
చును నెఱనమ్మ దేని నిలు ♦ చుండినపాటున భస్మమయ్యెదన్.

కాఁబట్టి భానుండులేని ప్రపంచముపగిది వెలవెలఁబోవునయో
ధ్యాపురంబున నుండలేక యీమునివేసంబును బూని భవదీయ
చరణసేవ సలుపవచ్చిన నన్ను మన్నించి కరుణింప వేఁడు
చున్నాఁడ.

రాము—తమ్ముఁడా ! ఇది యేటికోరికె ? వినుము పెద్దలవాంఛితం
బుల నన్యథాకరించుట భావ్యంబుగాదు. యుక్తాయుక్తవిచారణ
శూన్యులమై యట్టియవకతవక కార్యంబు లాచరించినచో
మన యిక్ష్వాకుకులంబునకుఁ గళంకముఁదెచ్చినవార మగుదుము
గదా ? అందుల కొప్పుకొనెదవా ?

భర—అవును.

రాము—కావుననే దండ్రియాజ్ఞనో దలధరించి,

గీ. తపసివేషముఁ బూని కాం ♦ తారములకు
వచ్చినాఁడను నాదగు ♦ వంతుఁదీతె
రాజ్యపరిపాలనాది భా ♦ రమునుదాల్చి
వంతుఁ జెల్లించుకొనుమయ్య ♦ భరతనీవు.

భర—అయ్యా ! లోకరక్షకా !

గీ. తండ్రియాజ్ఞను శిరమున ♦ దాల్చిదాని
యిచ్ఛవచ్చినవానికి ♦ నీయనాకుఁ
దగినయధికారమున్న క ♦ తానరామ
చంద్ర నీకర్పితముగ నో ♦ సంగినాఁడ.

కాన నామొఱాలించి.

గీ. పడినయోధ్యకువచ్చి ప్రే ♦ ముడిని బట్ట
భద్రుఁడవునై యీ రాజ్యప్ర ♦ పాలనంబుఁ
జేసికొనవయ్య మేము మీ ♦ సేవఁ జేసి
కొని మెలంగెద మయ్య యో ♦ గుణ నిదాన.

రాము—తమ్ముఁడా! నీవుచూపిన భ్రాతృవాత్సల్యంబున కెంతయు సంత
సించి నీదానంబుఁ బరిగ్రహించితి కాని,

గీ. మొదటఁ బదునాలుగేడు లీ ♦ విధినివస ని
వాస మొనరించిపిమ్మట ♦ వచ్చి నీదు
దానముగ్రహించి నాదు శ ♦ క్త్యాను సార
మేలెదనుగాన భయమేల ♦ నింక భరత.

ఇందుల కంగీకరింతువేని,

గీ. తండ్రికోరికెఁ దీర్చిన ♦ ధన్యు నగుదు
భానుకులసత్య వాక్పరి ♦ పాలనంబుఁ
బ్రోచుటఁ గృతార్థనైదు నీ ♦ మొఱను సార్థ
కంబొనర్పుటచే గౌర ♦ వంబుఁ గాంతు.

భర—అన్నా!

గీ. రాము లేకుండ నేనయో ♦ ధ్యా పురంబు
పోవఁజాలను గాన నా ♦ మొఱనువిని కృ
పామతిని వచ్చిరాఘవ ♦ రామ మము కృ
తార్థులుగఁ జేయుమయ్య వం ♦ దన మొనర్తు.

రాము—తమ్ముఁడా! అధర్మకార్యంబున కిటులఁ బురిగొల్పుట యు
త్తమమేనా? దేశాచారమునననుసరించి జ్యేష్ఠుఁడనైనంత మా
త్రమునఁ దండ్రిగారి శాసన ముల్లంఘించి యిహ పరంబులకు
రెంటికిఁ జెడుమందు వేమి యన్యాయమిది.

భర—అయ్యా! గురూత్తమా! ఈమహాను భావునకుఁ దామైన నచ్చఁజెప్పి నన్ను నలువురిలోఁ బడవేయుఁ సూత్రమునుజూచి పుణ్యముఁ గట్టుకొనుఁడు.

వశి—భరతా! ఏమిచెప్పుదును! శ్రీరాముఁడు తండ్రిగారి శాసనము నకు బద్ధుఁడై గదా యరణ్యములకువచ్చెను? అద్దానిమితిమీరి యయోధ్యా నగరంబునకు వచ్చినచోఁ బలువురి నగుబాటు లకుఁ బాలగుట నిక్కువము. తండ్రిగారిచే నీకొసంగఁబడిన రాజ్యంబున శ్రీరామచంద్రార్పణ మొనర్చుటచే యద్దానిఁ బరి గ్రహించి రాజ్యభారము వహించుటయు రామునకుఁ గర్తవ్యం బే కావునఁ గులగురువునగు నామాట మీరువుభయులు వినఁ దలంతురేని యిట్టులాచరించిన బాగుండును.

గీ. వనములోనుంటివను రాము ♦ భద్రుఁ డిచ్చు
మేదయిన నొందుఁ గొనిపోయి ♦ యింపుమీఱ
రామునకు మాఱుగా నీవు ♦ రాజ్యమేలు
మయ్య శ్రీరాముఁడే ప్రభుఁ ♦ డనుచుఁ జాటి.

భర—(తనలో) ఎంతవిపరీతము!

చ. జనకునిగోలుపోయి, గుణ ♦ సాంద్రుని రాముని కాననంబులం
దున వసియింపఁబడి, యతి ♦ దుష్టుఁడనంచు నయోధ్యయందుఁ బే
ర్గని, యపనిందఁ బొందొన ♦ గాఁ జనుదెంచి తిరస్కరింపులం
దిన ఖలుఁడన్ మొగంబెట్టుల ♦ నేఁటి నెత్తుక సంచరించెదన్.

గీ. మొండిజీవంబు లీపాడు ♦ బొందినుండి
వదలకున్నవి నన్నప ♦ భ్రంశుఁజేయ
దైవమా! నాకికేగతి ♦ దయఁదలంచి
బలుకఁదగదొకొ నీకింక ♦ యలుకదగునె?

ఏమైననుగాని యిప్పుడు శ్రీరాముడయోధ్యానగరంబును బ్రవేశిం చువఱకు నేనా పురంబునకేఁ బోఁజాలను. (ప్రకాశముగా) దేవా! ఏమియాజ్ఞ?

వశి—భరతా! ఆజ్ఞకేమున్నది? శ్రీరామచంద్రుని పాదుకలఁ గొని పోయి యభిషేకించి యీ యరణ్యావాస కాలమంతయు గడుపుము.

రామ—గురువులయాజ్ఞ లతిక్రమణీయం బగుటంజేసి యట్లాచరిం పుము.

గీ. నాకుమారుగ సింహాస ♦ నమున నాదు
పాదుకలనుంచి రాజ్యప్ర ♦ పాలనంబుఁ
జేయుచుండిన నీకోర్కె ♦ సిద్ధిఁబొందుఁ
దండ్రివాంఛయుఁదీఱు స ♦ త్యమునునిలుచు.

భర—అయ్యా! నే నయోధ్యానగరంబునకు మాత్రము బోఁజాలను. తలయెత్తుకొని దిరుగఁజాలను.

వశి—అట్లయిన నందిగ్రామమునందుంచి యటులఁ జేయవచ్చును.

భర—దేవా మహేంద్రా! అన్నా రామచంద్రా! నాదొక్క విన్న పము గలదు. దాని నన్యథాపరుపరని నాయాశయము.

గీ. నాదు శిరమున సింహాస ♦ నముగ నెంచి
నలువుఁడభిషేక మిప్పుడీ ♦ స్థలమునందు
నాహృదంతరసీమ సం ♦ తసముఁబొందు
జన్మమా! ధన్యతనుగాంచు ♦ సదయులార.

వశి—అట్లనే! రామచంద్రా! పాదుకల నొసంగుము?

రామ—చిత్తము. భరతా! ఇవిగో (అని యిచ్చును.)

భర—(పాదుకలను గళ్లనద్దుకొని శిరంబునం దాల్చి) ధన్యోస్మి! ధన్యోస్మి!

గీ. రామచంద్రుని ఘనకృపా ♦ రసమువలన
దొరకి శిరమెక్కినట్టి పా ♦ దుకల మహిమ
చే సమసె సర్వపాపముల్ ♦ జెందెఁ దనువు
ధన్యతఁ గృతార్థుఁడనునైతి ♦ ధరణియందు.

దేవా! ఇట్లగునుగాత,

గీ. రామచంద్రుని పాదుకల్ ♦ రాజ్యమేలి
రామరాజ్యమె యనునటుల్ ♦ రహిఁ జెలంగి
శాంతి ప్రజలందు వ్యాపించి ♦ సత్య నియతి
వర్ధిలెడుఁగాత నిచ్చలీ ♦ వసుధయందు.

వశి—తథాస్తు.

రాము—భరతా! ఇఁక పోయిరమ్ము. దేవా! వందనంబులు. మేము దండకారణ్యమునకుఁ బోయి పర్ణశాల నిర్మించుకొని యట నుందుము.

భర—దేవా! సెలవు.

(అందఱు నిష్క్రమింతురు.)

శ్రీ పాదుకా పట్టాభిషేకము సంపూర్ణము.

